JAGATI Rs. 2-00 November 1990

36th Year of Publication




నవంబరు - 1990

## సాహితీ సుధ

అవమాన ప్రియ నీతివర్తనము ప్రాణాంతంబునన్ మలీ
మస మగ్రాహ్య మదుష్టయాచన మసంపత్ప్రార్థనా భావమున్
వ్యసనావ్యాప్తిని ధైర్యముం బుధజనా త్యంతాను కూలత్వ మీ
యసిధారా వ్రతచర్య యెవ్వడు మహార్య శ్రేణికిం దెల్పెనో

—భర్తృహరి



అతి సమర్థునకు జేయగరాని పనిలేదు - విద్యాధికుని కెందు వింతలేదు
పరమోక్తునకు నోట బలుకరానిది లేదు - సత్యసంధునకు బన్ధంబు లేదు
హననకారిక నిత డాత దన్నది లేదు - దుర్హితాత్మునకు వావి వరుస లేదు
భాగ్యశాలికి లభింపని శోభనము లేదు - పెద్దవానికి రాని చేటు లేదు
నేర్చి తిరిగిన వానికి నింద లేదు - కష్ట మోర్వక యున్న సౌఖ్యంబు లేదు
జ్ఞాననిధి గాక యున్న మోక్షంబు లేదు - రామలింగేశ రామచంద్ర పురివాస

—రామలింగేశ శతకం



'జ గ తి' - 2, కచేరీ రోడ్, మైలాపూర్, పి బి 2922, మద్రాసు - 600 004
ఫోన్ : 76697 - చందా 2 సం॥లకు రు. 45-00 - 5 సం॥లకు రు. 100-00 - జీవిత చందా రు. 300-00. పాట్రన్ - రు. 1000-00. విదేశాలకు 2 సం॥లకు రు.100-00

ముఖచిత్రం : పండిట్ నెహ్రూ

# నిమ్మతొనలు

ఇద్దరు వనితలు మధ్యాహ్నాల వేళ కబుర్లాడుతున్నారు.

'మా ఆయన జుట్టు తుమ్మెద రెక్కల్లా నల్లగా ఉంటుంది. వారి వెంట వెళ్తున్నప్పుడు నేను నల్లచీరె కట్టు కుంటాను' - అంది సుశి.

'మా అయన జుట్టు ఎప్పుడో తెల్ల బడిపోయింది. మా ఆయనికి మళ్లే డై చేసుకోరు. అంచేత, నేనెప్పుడూ తెల్ల చీరే కట్టుకుంటాను' - అని విజ్జి అనే సరికి, సుశి ముఖం మాడ్చుకుంది.

ఈ ఫ్రెండ్సిద్దరినీ మంచి మూడ్ లోకి తేవాలని శమ్మి అంది: 'ఒకరికి బ్లాక్ యిష్టం - మరొకరికి వైట్ యిష్టం - శ్రీవారి శిరోజాలని బట్టి! మరి నన్నేం చేయమంటారు చెప్పండి - మా వారిది బాల్డ్ హెడ్ ?'

— అమ్మాజీ సర్కార్

అల్‌హస్నా

ఒక రైలులో ఒక పురుషుడు ఒక స్త్రీ ఎక్కి ఒకే బెంచిమీద కూర్చున్నారు. అతడు చుట్టతాగుతున్నాడు; అమె ఒళ్లో ఒక సీమకుక్క ఉంది.

ఆమె చిరాకుగా, 'అ చుట్ట విసిరెయ్యండి - చెత్తకంపు' - అన్నది.

అతడు నవ్వుతూ 'అ కుక్కను విసిరెయ్యండి - ఒకటే మొరుగు' - అన్నాడు.

ఆవిడకు చిర్రెత్తి, అతని నోటిలో చుట్టలాగి, కిటికీలో నుండి అవతలకి విసిరేసింది.

ఆయనేం తక్కువ వాడా? అ కుక్కని ఎత్తి అవతలకి గిరవాటు

అ తరువాత ఇద్దరూ ఒకే స్టేషనులో దిగినప్పుడు, సవిలాసంగా చుట్ట పొగ పీల్చి వదులుతూ, తోకాడించుకుంటూ, అ కుక్క వాళ్ల కెదురైంది. ఒకళ్ల మొహాలు ఒకళ్లు వింతగా చూసుకున్నారు అ స్త్రీపురుష ద్వయం. అ తరువాత వాళ్లిద్దరూ వివాహమాడారట.

—భట్టిప్రోలు కృష్ణమూర్తి

భువనేశ్వర్

పోస్టమాన్ వెంకటేశు కనిపించగానే రచయిత రామావతారం అడిగాడు;

'ఏమయ్యా, వెంకటేశూ నాకేదైనా యమ్ ఒ వచ్చిందేమో చూడు.'

'అయిదు రోజులబట్టి అడుగుతున్నారు - ఎక్కడ నుంచి రావాలి బాబూ ?' - అని నెమ్మదిగా ప్రశ్నించాడు వెంకటేశు.

'నాకధ అచ్చయి పదిహేను రోజులయింది. ఏ వారానికా వారం పారితోషికం పంపించేస్తున్నామన్నారు పత్రిక వాళ్లు.'

'అలాగా, బాబూ - ఇవ్వాళ రాలేదు - రేపటెల్లుండిలో వస్తుం దేమో';

'పోనీ, మా పక్కింటి గోపీనాధ రావుకి ఏదైనా యమ్ఓ వచ్చిందా?'

'ఆ విషయం మీకెందుకు?' అని ప్రశ్నించాడు వెంకటేశు.

'భలే వాడివయ్యా - ఆయనని అప్పు అడిగేందుకు' అని నవ్వుతూ రచయిత రామావతారం.

జి సుబ్రహ్మణ్యశర్మ
అమలాపురం

దేవాదాయ అధికారి ఆలయ అర్చకుని అడుగుతున్నాడు: 'ఏమండీ ఈ గుడికివచ్చే రాబడి ఆ ఏటికా ఏడో తగ్గిపోతోంది. కారణమేమిటం టారు? ప్రజలలో దైవభక్తి పెరుగు తున్న దాఖలాలు మనకి స్పష్టంగా కనిపిస్తున్నాయే!'

'నిజమేనండి - కాని, ఈ ఆలయం శిధిలావస్థలో ఉంది. పక్కఊళ్లోని ఆలయం కొత్తగా కట్టించారు. చాలా మంది అక్కడికి పోతున్నారు. లౌడ్ స్పీకర్లూ, హరికధలూ, పాట కచ్చేరీలు యిలాటివన్నీ అక్కడ వున్నాయి,' అని చెప్పాడు అర్చకుడు.

'ఈ ఫీల్డ్‌లో కూడా కాంపిటిషనా?'

'లేని దెక్కడండి - మనిషెంతో దేవుడంతకద' - అని అర్చకుడు అనే సరికి, అధికారికి నోటమాట రాలేదు.

—యమ్ శాంతలక్ష్మి
కాకినాడ - 3



ఆనందమనేది మనలోనూ లేదూ, వెలుపలనూ లేదూ - విశ్వాత్మతో మనం ఏర్పరుచుకొనే సంధానంలో వుంది. —పాస్కల్

జీవితంలో విజయానికి పది సూత్రాలు వున్నాయి. మొదటిది: మనకి కావల్సినది తెలుసుకోవడం; రెండవది: ఆ తెలుసుకున్నది ఆచరణ లో పెట్టడం, మిగతా ఎనిమిదీ ఆ రెండింటికీ కాపీలు. —వార్ని రైట్




జి. పుల్లారెడ్డి
స్వచ్ఛమైన నేతి మిఠాయి

హైదరాబాదు
ఫోను: 230833

కర్నూలు
ఫోను: 20288, 21445




# పాఠకుల తీర్పు

చండూర్‌గారికి : మీ కేరళ ట్రావెలోగ్ సెప్టెంబరు సంచికలో చదివిన మీదట ఈ లేఖ వ్రాయాలనిపించింది. క్రైస్తవులు, ముస్లిమ్‌లు తమ ఆచారాలు పాటిస్తున్నప్పుడు, హిందువులు ఎందుకు నిర్లక్ష్యం చేయాలి? దేవాలయంలోకి షర్టు లేకుండా ప్రవేశించాలనే నియమంవున్నప్పుడు, అది పాటించడానికి అభ్యంతర మేమిటి? హిందువుగా పుట్టినందుకు నేను గర్వపడుతున్నాను.... హిందువులందరూ తమ మతంలోని ఔన్నత్యం తెలుసుకోవాలి. మీలో పేరుకునున్న దురభిప్రాయాలు పోయేందుకు స్వామీ వివేకానందుని రచనలు చదవండి. మీ కలం కేవలం విమర్శించేది కాకూడదనీ, లోతైన విషయాలు చెప్పగలగాలనీ నా కోరిక.

—యస్. శ్రీనివాస్
మద్రాసు - 17

చండూర్ దంపతులకు : శుభం. కేసరిగారి 'చిన్ననాటి ముచ్చట్లు' చదువుచున్నాను - హృదయానందంగా వున్నవి. 'స్త్రీ' అభ్యుదయం కొరకై ఎంతో శ్రమించిన వారు. 'శారదా నికేతను'లో నా సోదరి శ్రీమతి పుష్ప కుమారి, అనసూయలే గాక, శ్రీమతి భారతీదేవి కూడా వుండేవారు. ఆ లక్ష్మీ నారాయణ, లక్ష్మీబాయమ్మ మాకు అనుంగు మిత్రులు. శ్రీ వీరేశలింగంగారికి తగిన సంఘసంస్కార యోధులు. వారి వలెనే శ్రీమతి సంగం లక్ష్మీబాయమ్మ సంఘ సేవ చేసిరి. స్త్రీల సంస్కరణ, జీవితాంతం విద్యాలయాన్ని నడిపిరి. ఆమె ఆదర్శవంతమైన మంత్రిణిగా, యమ్‌పి గా సేవించిరి. మా దంపతులకు ప్రాణప్రదంగా వుండి, ఉన్నవ, కేసరిగారికి గౌరవము కలిగించిరి. మన దేశ యువతీమణుల వుద్ధరణకై పాటుపడిన సుప్రసిద్ధ దుర్గాబాయమ్మ వలెనే పూజనీయులైరి. మీ గురించి బి.యస్.ఆర్. కృష్ణ చెప్పుతుంటారు .... ప్రేమతో....

—యన్‌జి రంగా
న్యూఢిల్లీ

చండూర్ గారికి : మీ 'జగతి'లో ప్రతినెలా క్రొంగ్రొత్త జగతిని చూస్తున్నాం.... సోమసుందర్‌గారు లోగడ మీరు 'మాలి' పత్రిక నడిపేవారని, ఆ పత్రికకు తాను కూడా రచనలు కంట్రిబ్యూట్ చేశాననీ చెబుతూ మీ సహృదయత ప్రశంసించారు.... కొందరు ఎంతగానో మెచ్చుకొనే ఆ 'మాలి' పత్రిక నేను చూడలేదు.

—సి మల్లిబాబు
దుమ్ముగూడెం

## పన్నె కెరటాలు

### రాడికల్ హ్యూమనిజమ్

కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ స్థాపకులలో ప్రముఖుడైన ఎం.ఎన్. రాయ్ మానవతావాదుల ఇంటర్నేషనల్ వ్యవస్థాపకుడైనాడు. మానవుడు సమాజానికి మూల రూపమని రాడికల్ హ్యూమనిజం వాదం - వ్యక్తిగత శక్తిసామర్థ్యాల పెంపునకు సహకార సాంఘిక సంబంధాలు దోహదం చేస్తాయి. వ్యక్తి పెరుగుదల సాంఘికాభ్యుదయానికి ఒక కొలమానము. కనుక ప్రగతి అనేది ప్రాథమికమైన మానవ వాంఛల ఫలితమే. స్వాతంత్ర్యం కోసం అన్వేషణ, సత్యాన్వేషణం మానవ ఆదర్శాలు. కాబట్టి స్వాతంత్ర్యమనే నవ ప్రపంచ సృష్టికి సమాజ ఆర్థిక వ్యవస్థను దాటి అవతలికి వెళ్ళాలి. ప్రజానీకానికి ఆర్థికంగా విమోచనం కలిగించవలసిందే. కాని అది స్వేఛ్ఛా సమాజ ఆవిర్భావం దృష్ట్యా జరగాలి. ఇదీ రాయ్ ప్రతిపాదించిన నవ్య మానవతావాదం సారాంశం.

—డి రామలింగం
'యోజన'లో

### తల్లాప్రగడ సుబ్బారావు

వీరిది పశ్చిమగోదావరి జిల్లా ఏలూరు దగ్గర దొమ్మేరు అగ్రహారం. వీరి మేనమామలు పిఠాపురం జమీందారు వద్ద దివానులు. శ్రీ సుబ్బారావు 6-7-1856న కాకినాడలో జన్మించారు. 34 సంవత్సరాల అతి తక్కువ కాలం జీవించి 25-6-1890న మదరాసులో మరణించారు. గొప్ప మేధావి - దాదాపు ఏకసంధాగ్రాహి. క్షణం తీరుబడి లేని న్యాయవాద వృత్తిలో వుండిగూడ, అధ్యాత్మ విషయాల వేపు దృష్టిసారించి వేదాలు, ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రాల విజ్ఞానాన్ని 'కరతలామలకం' చేసుకోవడంతోపాటు పాశ్చాత్య వేదాంత, తత్త్వదోరణులు సైతం ఆకళింపు చేసుకున్నారు ... దివ్యజ్ఞాన వార్షిక సభలలో (1886) భగవద్గీత బోధనలను గురించి శ్రీ సుబ్బారావు ఇచ్చిన ఉపన్యాసాలు ఇప్పటికీ ప్రామాణికమయిన ఆధ్యాత్మిక దర్శనఫలంగా పండిత లోకంలో వాడుక వుంది.

—శ్రీ విరించి
'నిత్యనూతన'లో

# పాతికేళ్ల నాటి పిక్చర్

## పరమానందయ్య శిష్యుల కథ

పురాణాలలోని పరశరాముని కాలంలో క్షత్రియస్త్రీలను బ్రాహ్మణులూ, బ్రాహ్మణస్త్రీలను క్షత్రియులూ వివాహమాడుతుండేవారు. 'ఇదం బ్రాహ్మమ్ - ఇదంక్షాత్రమ్' అనిపించుకున్న రోజులవి. ఈనాటి సినిమాలలో గంధర్వస్త్రీలు శాపవశాన మానవలోకానికి వచ్చి, మనుజాధిపతులను వివాహమాడుతుంటారు. శాపమనేది గంధర్వలోకానికీ మానవలోకానికీ మధ్య సినిమావారు వీలుగా వేసుకున్న వంతెన.... మనం అనేకసార్లు వెండితెరమీద చూసిన మహారాజు (యన్‌టి రామారావు) ఈసారి నందివర్ధన నామధేయుడు, రాజనర్తకి రంజని (యల్ విజయలక్ష్మి) మోహం బుధిలోపడి, రాచకార్యాలు విస్మరించగా, గురువరేణ్యుడైన పరమానందయ్యగారు (నాగయ్య) వచ్చి, ముప్పొద్దులా శివజపంమాత్రం మానకు సుమా - అని హితోపదేశం చేస్తాడు. ఒక ఉదయం, రంజని శయ్యా మందిరంలో నందివర్ధన మహారాజు, అవంతేశ్వర స్థలపురాణం అమలు జరపగా, ప్రమథగణాధిపతిలో పార్వతీదేవి 'యిదేమి శివపూజ - ఛ ఛ' అంటుంది. ఆ సమయానికి చిత్రలేఖ అక్కడికి రావటం, పరమశివుడిచ్చిన రుద్రాక్షమాలని ఆ అభాగ్యురాలు పోగొట్టుకోవడం, అరుణకేశముని ఏడుగురు శిష్యులు, శాప ప్రతిశాపాలు, భూలోకంలో సచ్ఛీలుడైన రాజు, దుష్టుడైన మంత్రి, దొంగలముఠా, మొదట బుద్ధిహీనంగా కనిపించినా, చివరికి లోకోపకారంగా పరిణమించే, పరమానందయ్య శిష్యుల చేష్టలు, రాజనర్తకి ఆత్మార్పణ, గంధర్వకన్య భూనాధుని వివాహమాడటం - ఈ ప్రకారం ముగుస్తుంది కద.... నందివరన మహారాజు పువ్వులని బంతుల్లా విసరకుండావుంటే బావుండేది. భగవత్ ధ్యానానికి చేతులు వూపే నాటకీయ పద్ధతి సముచితంకాదు.... పాటలూ పద్యాలూ ఎంతో శ్రావ్యంగా ఉన్నాయి. కథా సన్నివేశాలు సందర్భోచితంగా చిత్రగమనానికి పుష్టినిస్తున్నాయి. రసస్ఫోరక సంభాషణలతో జనాకర్షణీయంగా వున్న చిత్రమిది.

—యన్నార్ చందూర్ సమీక్ష
'జగతి' - మే - 1966

---

భగవంతుడు 'మొట్టమొదటి తోట' వేశాడు గనకనే, తోటల పెంపకంలో అంత స్వచ్ఛమైన అనందం ఉంటోంది.

— బేకన్

స్త్రీలు మూర్ఖులు కాదని నేననడం లేదు - భగవంతుడు వారిని పురుషుల లో సమవుజ్జీవులుగా సృష్టించాడాయె!

—జార్జి ఎలియట్

## మానవ ప్రగతి

## ఓజోన్ పొర

'మాంట్రియల్ ప్రోటోకాల్' ని సవరించడానికి 50కి పైగా దేశాలకు చెందిన పర్యావరణ శాఖల మంత్రులు అంగీకరించారు. మనిషి తయారుచేసి వినియోగిస్తున్న క్లోరిన్ రసాయనాల వల్ల దక్షిణ, ఉత్తరార్ధగోళాల వాతావరణంలో భూమికి రక్షణ కవచంలా వున్న ఓజోన్ పొర క్షీణించి పోవడంతో ఈ నిర్ణయం తీసుకున్నారు. 1987 నాటి 'మాంట్రియల్ ప్రోటోకాల్'కి సవరణలు జరిపేందుకై ఇటీవల సమావేశమైన వివిధ దేశాల విదేశాంగ మంత్రులు, ఉన్నతాధికారులు మున్నగువారు 'ఓజోన్' క్షీణింపునకు కారణమవుతున్న 'క్లోరోఫ్లోరో కార్బన్ల' వినియోగాన్ని 2000 సంవత్సరం నాటికి పూర్తిగా నిలిపివేయాలని ఏకగ్రీవంగా తీర్మానించారు. వర్ధమాన దేశాలు ఈ రసాయనాల వినియోగాన్ని నిలుపు చేయడంలో తోడ్పడేందుకై ఒక ప్రత్యేక నిధిని ఏర్పాటు చేయాలని కూడా వారు నిర్ణయించారు. 1998 నాటికి 'క్లోరోఫ్లోరో కార్బన్ల' వినియోగాన్ని 50 శాతం తగ్గించాలని 'మాంట్రియల్ ప్రోటోకాల్' నిర్దేశించింది. కాగా ఇప్పుడు దానిని సవరించి 2000 సంవత్సరానికి ఈ రసాయనాల వినియోగాన్ని పూర్తిగా నిలిపివేయడానికి వివిధదేశాలు అంగీకరించడం హర్షదాయకమైన చర్చలలో ఒకటి. రిఫ్రిజిరేషన్, ఎయిర్ కండిషనింగ్, ఎయిరోసాల్ స్ప్రేస్, సాల్వెంట్స్ మొదలైన వాటిలో వినియోగించే క్లోరోఫ్లోరో కార్బన్లతో పాటు అగ్నిమాపక సాధనాలలో వినియోగించే 'హాలన్స్' వాడకానికి కూడా స్వస్తి చెప్పాలని వివిధ దేశాలు ఇప్పుడు నిర్ణయించాయి.

## ఉపగ్రహం

భూమికి 900 కిలో మీటర్ల ఎత్తున మన సుదూర గ్రహణ ఉపగ్రహం - ఐ.ఆర్.ఎస్ - 1ఎ - పరిభ్రమిస్తూ, అమూల్యమైన సమాచారాన్ని అందిస్తున్నది. ఈ ఉపగ్రహం అంతరిక్షంలో ఉన్న 28 నెలల కాలంలో దానికి అప్పగించిన అన్ని

పనులను సంతృప్తికరంగా పూర్తి చేసింది. వ్యవసాయం, భూగర్భ సంపద మత్స్య సంపద, భూగర్భ జల సంపద, అటవీ సంపద వంటి వాటికి ఈ ఉపగ్రహం పంపిన ఫోటోలు, మన శాస్త్రవేత్తలకు ఎంత గానో తోడ్పడ్డాయి. ఇందులో రెండు కెమెరాలను అమర్చారు. ఈ ఉప గ్రహం ఉత్తర, దక్షిణ ధృవాల మీదుగా రేఖాంశాలకు సమాంతరంగా పరిభ్రమిస్తున్నది. ప్రతి 24 రోజులకూ ఒకసారి తిరిగి పాత కక్ష్యకు వస్తూ ఉండం వల్ల 24 రోజులకొకసారి ఈ ఉపగ్రహం ఒకే ప్రాంతానికి సంబధిం చిన ఫోటోలను ఈ కెమెరాలు భూమిపైకి పంపడం జరుగుతూ ఉంటుంది. ఈ ఉపగ్రహం పంపిన ఫోగట్టాను హైదరాబాద్ సమీపంలో షాద్‌నగర్‌లో గల గ్రాహక కేంద్రం స్వీకరిస్తుంది. 'గ్రహణ వ్యవస్థ' విశ్లే షించి, సంబంధిత సంస్థలకు అంది స్తుంది. ఈ ఉపగ్రహాన్ని ప్రయోగించే వరకు లాండ్‌శాట్, స్పాట్ ఉప గ్రహాలు పంపిన ఫోటోలను ఉపయో గించుకొనడం జరిగింది.

## గుడ్లగూబ

'నార్దర్న్ స్పాటెడ్ అవుల్' అనే మచ్చల గుడ్లగూబ అమెరికాలో అంత రించి పోతున్న పక్షి జాతుల జాబితా లోకి ఎక్కింది. ఈ 'ఉలూకం' నివాస ప్రాంతాల పరిరక్షణకు చర్యలు తీసు కోవాలని వన్యప్రాణుల విభాగం నిర్ణ యించింది. ఈ మచ్చల గుడ్లగూబలు ప్రధానంగా ఉత్తర కాలిఫోర్నియా, ఒరెగాంలలో నివసిస్తున్నప్పటికీ వాటి నివాసాలు వాషింగ్టన్ రాష్ట్రం, ఇంకా బ్రిటిష్ కొలంబియాలోని కెనెడియన్ ప్రావిన్స్‌వరకు విస్తరించాయి. మచ్చల గుడ్లగూబల నివాస ప్రాంతాలను పరి రక్షించనున్నట్టు వెలువడిన ప్రకటన అయాప్రాంతాలలో చెట్లనుంచి దుంగలు తయారుచేసే పరిశ్రమల వారికి ఆందో ళన కలిగించింది. అయా ప్రాంతాలలో దుంగలు తయారుచెయ్యడం ఒకప్రధాన పరిశ్రమగా వుంది. ఈపరిశ్రమ వేలాది మందికి జీవనోపాధి కల్పిస్తున్నప్పటికీ గుడ్లగూబల సంరక్షణ అనే అంశం ప్రధానమయింది.... నూతన విధానం ప్రకారం ఎక్కువ సంఖ్యలో గుడ్లగూబలను పరిరక్షిస్తూనే దానితో పాటుగా దుంగల పరిశ్రమలో వీలై నంత ఎక్కువమంది ఉద్యోగాలకు కూడా ఈ చర్యల వల్ల ముప్పు వాటిల్ల కుండాచూస్తారు. ఈ చర్య క్రింద 450 జతల గుడ్లగూబలను పరిరక్షిస్తారు.



ఈ ప్రపంచం ఆరు రోజులలో సృష్టింపబడిందనే విషయం మరువక, పరుగు అందుకో. —నెపోలియన్

స్త్రీలు తమ కనుకొలకుల ద్వారా అపూర్వ సందేశాలు పలికిస్తారు. నయగారమే వారికిగల అద్భుత ఆయుధం. ఆ సందేశాల అర్థం మనం ఏనాడూ అనువదించి చెప్పలేము ఎంచేతనంటే, తమ చూపులకి తాము చెప్పే అర్థాలే ఖరారంటారు.

—స్టెండాల్

# కొత్త పుస్తకాలు

'మన వివాహ వ్యవస్థ' - రచన: నోరి శ్రీనాథ వేంకట సోమయాజులు. ప్రచురణ: రామకృష్ణ పబ్లికేషన్స్, 2 రామన్‌వీధి, టీ. నగర్, మద్రాసు - 600017. వెల: రు. 25-00.

హిందూ వివాహ వ్యవస్థ ఎటువంటిదీ? దీనిలో ఏమైనా లోపాలున్నాయా? ప్రేమించి పెళ్లి చేసుకొన్న యువతీ యువకులు సుఖంగా ఎందుకుండ లేకపోతున్నారు? వరకట్నం చావులకి అంతం లేదా? స్త్రీల పరిస్థితి మెరుగవదా? - ఇలాటి విషయాలెన్నో సాకల్యంగా పరిశీలించారు రచయిత. వివాహ బంధానికి గల పుట్టు పూర్వోత్తరాలు, మన ప్రాచీనుల విశాల దృక్పథమూ ఈ పుస్తకంలో వివరించారు.

సంచార జాతుల కాలమూ, పశుపాలకుల యుగమూ గడిచాక, వ్యవసాయ జీవనం ప్రారంభమయింది. దేశ దిమ్మరులు స్థిరనివాసులయారు; ఇల్లూ వాకిలీ ఏర్పడింది; ఇంటిని కనిపెట్టుకు నుండేందుకు యిల్లాలు అవసరమయింది. వ్యవసాయ జీవనం తోటే వెనకటి విశృంఖలత పోయి, 'వివాహం' అనే ఒక కట్టడి ఏర్పడింది. 'నగృహం గృహముచ్యతే - గృహణే గృహముచ్యతే' - అన్నారు. చతుర్విధ ఆశ్రమాలలో గార్హ్యస్థానికి గౌరవమిచ్చారు.

ఈజిప్టులో మెన్సూ, చైనాలో ఫోహి, మన దేశంలో శ్వేత కేతువు, స్త్రీ పురుషుల కలయికకు నియమ నిబంధనలు వుండాలనీ, వాటిని ఉల్లంఘించిన వారు శిక్షార్హులనీ శాసించారు (ఉద్దాలక మహర్షి కొడుకైన శ్వేతు కేతువు, తన కళ్లముందే తన తల్లిని దుండగులు ఎత్తుకు పోవడం చూసి, ఈ వైవాహిక నియమం విధించాడని పురాణ గాథ)

హిందూ వివాహం ధార్మిక ప్రధానమైనది - కేవలం శారీరక వాంఛలు తీర్చుకునేందుకు కాదు. ధర్మపాలనలో అది అంతర్భాగం. భార్య పక్కన లేకుండా యజ్ఞ యాగాదులుగాని, ఏ యితర క్రతువులు గాని చేయడానికి పురుషుడు అనర్హుడు. 'పత్నీ ధర్మార్థ కామానాం కారణం ప్రవర్తం స్మృతమ్' జీవితం పంచుకొనే అర్ధాంగి సామాన్య పత్నిగా గాక ధర్మపత్ని అయింది.

ఎనిమిది రకాల వివాహాలను వెనకటి వారు గుర్తించారు - ఆమోదించారు బ్రాహ్మము, దైవము, ఆర్షము, ప్రాజాపత్యము, ఆసురము, గాంధర్వము, రాక్షసము, పైశాచము. పైశాచిక

మనగా నిద్రపోతున్నది, ఒంటరిగా నున్నది, స్పృహలేనిదీ అయిన కన్యపై అత్యాచారం జరపడం, మోసగించి ఎత్తుకు పోవడమూను. గాంధర్వమంటే మనకు ఈనాడు తెలిసినదే - పరస్పరం యిష్టపడి దగ్గిరవటం.

మన సంస్కృతిలో వివాహ, వర్ణ వ్యవస్థల సంబంధం గణనీయమైనది. బ్రాహ్మ, దైవ, ఆర్ష, ప్రాజాపత్యాలనే నాలుగు వివాహ పద్ధతులే ప్రశస్తమూ సమంత్రకమూను. సగోత్ర, సపిండ, వినిమయ వివాహాలు నిషిద్ధం. సగోత్ర, సపిండ అంటే ఈనాడు మనం చెప్పు కొనే 'జీన్స్' కి సన్నిహితమైనవి. పురుషుని వైపు ఏడుతరాలు, స్త్రీ వైపు అయిదుతరాలు - దగ్గిర బంధువుల మధ్య పెళ్లిళ్లు జరగకూడదన్నారు. ఆరోగ్య పరంగాను, జీవన వైశాల్యతకు ప్రాచీనులు నిర్ణయించిన పద్ధతి అది. అలాగే, 'వినిమయ' - అంటే, కుండ మార్పిడి పెళ్లిళ్లను, వరుని చెల్లెల్ని వధువు అన్నగారు చేసుకోవడం లాటివి, నిషిద్ధమన్నారు. 'అనులోమ' వివాహాలు అనివార్యమని ఆనాటి వారికీ తెలుసు. బ్రహ్మక్షత్రియ వైశ్య, శూద్రులనే ఈ నాలుగు వర్ణాలలో, ఒక వర్ణంలోని పురుషునికీ మరొక వర్ణంలోని స్త్రీకి ఏర్పడే బాంధవ్యాన్ని 'అనులోమ' అన్నారు. బ్రాహ్మణుడు శూద్ర స్త్రీతో కాపరం చేస్తూ వుండవచ్చు ; అలాగే, శూద్రుడు బ్రాహ్మణ స్త్రీతో కాపరం చేస్తూ వుండవచ్చు. అదే మాదిరి క్షత్రియులలోను, వైశ్యులలోను కూడా ! దీనిని 'సాంకర్యం' అన్నారే తప్ప, వివాహపరంగా గుర్తింపుకి అభ్యంతరం చెప్పలేదు. అనులోమ సాంకర్యం (పురుషుడు ఉత్తమ కులజుడు), ప్రతిలోమ సాంకర్యం (స్త్రీ ఉత్తమ కులజ) - ఈ సాంకర్య ఫలితమైన సంతానానికి కులాలు నిర్ణయించారు. ఈ సంకర జాతికి జన్మించిన వారికి మళ్లీ కులవిభజన జరిగింది. శ్రీ కృష్ణ నిర్యాణానంతరం అర్జునుడు, నిషాదుల చేత ఓడింపబడ్డాడని మహాభారతంలో చదువుతాం. ఎవరీ నిషాదులు - బ్రాహ్మణ పురుషులకు శూద్ర స్త్రీలకు జన్మించినవారు. బ్రాహ్మణ పురుషునికి వైశ్య స్త్రీకి జన్మించిన వాడు అంబష్ఠ. భారతగాథ శౌనకాది మహామునులకు చెప్పిన సూతుడు, క్షత్రియ భర్తకు బ్రాహ్మణ కాంతకు జన్మించిన వాడు. శూద్ర పురుషునికి, నిషాద స్త్రీకి జన్మించిన వానిని కుక్కుటకు డంటారు. అనులోమ సాంకర్యం మూడు విధాలు ప్రతిలోమ సాంకర్యం ఆరు విధాలు : రెండవతరంలో పది విధాలవుతుంది - సాంకర్య జనితమైన ఈ 19 శాఖలకు వేర్వేరు పేర్లు వున్నాయి. వర్ణ వ్యవస్థకు కట్టుబడ్డ కాలం కాబట్టి ఎవరి స్థానం వారు అంగీకరించే వారు. నేటి సంకుచితత్వాలతో పోల్చి చూస్తే, ప్రాచీనులది ఎంతటి సువిశాల దృక్పథమో బోధ పడుతుంది.

వధూవరుల జాతక చక్రాల పరిశీలన వెనకటి రోజులలో లేదనీ క్రీస్తు శకం నాలుగవ శతాబ్దంలో భాసుని నాటకాలలో జాతక ప్రస్తావన మొదటి

సారిగా కనిపిస్తున్నదనీ చెబుతున్నారు రచయిత సోమయాజులు. ఇక, గృహ్యా సూత్రాలలో బౌధాయన, అపస్తంబ, సత్యాషాఢ, ద్రాహ్యాయణ, అగస్త్య, శాండిల్య. అశ్వలాయన, శాంభవ, కాత్యాయన అనే తొమ్మిది అతి ప్రాచీన మైనవి. వరపూజ, విఘ్నేశ్వర పూజ, పుణ్యాహవాచనం, మధుపర్కం, మహా సంకల్పం, కన్యాదానం, ముహూర్తం, మంగళ సూత్రధారణ, తలంబ్రాలు, ప్రధాన హెూమం, సప్తపది, స్థాలీపాకం, అరుంధతీ దర్శనం, సదస్యం, నాకబలి అప్పగింతలు - యిలా మొత్తం 35 విధులు పాటించాలి అపస్తంబ గృహ్యా సూత్రాల ప్రకారం .... అయిదురోజుల పెళ్లి, పదహారు రోజుల పండగ గాక, ముహూర్తం రిసెప్షనులతో ముగు స్తున్న కాలమిది.

ట్రయల్ మారేజ్, కంపానియనేట్ మారేజ్, టెంపొరరీ మారేజ్ - అనేవి పాశ్చాత్య ప్రపంచం నుంచి వినిపిస్తు న్నాయి. ఎంత చెప్పినా, ఎన్ని చెప్పినా 'హిందూ వివాహం' ఒక ధార్మిక సంస్కారం. కళ్యాణ వేదికపై కూచున్న యువతీ యువకులకు ఆ మంత్రాలేమీ భోధపడక పోవచ్చు గాని పురోహితుడు చెప్పినవన్నీ భయభక్తులతో వినమ్రం గా పాటిస్తారు. ఆ ప్రాచీన వారసత్వ పరిరక్షణే, ఒక విధంగా ధర్మపాలన అనిపించుకుంటుంది.

రచయిత సోమయాజులు మన వివాహ వ్యవస్థ గురించి చాలా చక్కగా,




జమ్మివారి

# లివర్ క్యూర్



పసిబిడ్డలకు యేర్పడు కామెర్లు (జాండీస్) ఆకలి లేమి, మలబద్ధకము, మలము తెల్లగా పోవుట, మూత్రము విసర్జించినచోట తెల్లగ మరక కట్టుట— మొదలైనవి లివరువ్యాధి సూచనలగును.

ఈ వ్యాధిని నిర్మూలించుటకు 'జమ్మి' వారి డాక్టరును సంప్రదించండి.

ప్రతినెలా వారిడాక్టరు మీ ఊళ్లకు వచ్చెదరు.

'జమ్మి బిల్డింగ్స్'

61, రాయపేట హైరోడు, మద్రాసు - 600 004 - ఫోన్ నెం. 72539




విపులంగా, హృద్యంగా చెప్పారు. బాపు, భావగర్భిత ముఖచిత్రంలో, కూచిపూడి అర్ధనారీశ్వరి పచ్చతోరణపు పసుపు కుంకుమల గుమ్మంలో నిలబడి పలకరిస్తుంది.

—క్షీరసాగరమ్

కవితా సుధ - పచ్చిగోళ్ల సుధ, విశాఖపట్నం.

ఈ మినీ కవితల సంపుటికి కొత్ర మల్లికార్జున శర్మ అభినందన తెలుపుతూ, యివి హృదయోల్లాసాన్ని కల్గించేవిగా ఉన్నాయన్నారు. పురుషాధిక్య ప్రపంచంలో స్త్రీ గౌరవింపబడాలనే భావాన్ని, రాజకీయ కుతంత్రాలపై ద్వేషాన్ని వ్యక్తబరుస్తారు ఈమె అన్నారు కొల్లూరి.

తెలుగు విశ్వవిద్యాలయం వారి ఆర్థిక సహాయం పొందిన ఈ కవితా సంకలనాన్ని యింకొంచెం అందంగా, అకర్షణీయంగా ప్రింటు చేయిస్తే బావుండుననిపిస్తుంది.

'స్త్రీకి అనుమాన మెక్కువ - పురుషుడికి అధికారం మెక్కువ' అని స్త్రీ పురుష వ్యత్యాసం గురించి చెబుతూ, 'చీడపట్టిన మొక్కను రోగ మొచ్చిన మనిషిని - మందులతో మార్చగలం - కుళ్లిన ఈ దేశాన్ని ఏ మందుతో బాగు చేయగలం?' - అని వాపోతారు కవయిత్రి. 'మనిషి మనిషిలో ఎన్నో లోపాలు - వీధి వీధిలో ఎన్నో పాపాలు - అడుగడుగునా దేవుని రూపాలు సెంటర్లలో మహాత్మ విగ్రహాలు - నా దేశ అలంకారాలు' అని ప్రత్యక్ష నిజాలు వెల్లడిస్తూ మధ్యతరగతి నుద్దేశించి, 'పరువు కోసం పసుపుకార్డు - నా శరీరం కప్పడానికి జనతా వస్త్రాల్లేవు - నా కడుపు నింపుకోడానికి చవక బియ్యంలేవు.... పోజిచ్చాను ఓటరుగా మరో ఫొటోకి' - అనే సుధ కవితాస్వనంలో వేదనా రవళి ఉంది.

—సుమతీ సాగర్

## ఈ మధ్య అందినవి :

'హస్త సాముద్రిక సర్వస్వం' శార్వరి.... శార్వరి పబ్లిషింగ్ హౌస్, రు. 40-00.

'గీతామృత వర్షిణి' - రామానుజ జియ్యర్ స్వామి (రు. 30-00); 'తమసోమా జ్యోతిర్గమయ' - కందుకూరి వీరేశలింగం దంపతుల సంగీత నృత్యరూపకం - (రు. 4-00); వక్తృత్వ శిక్షణ (రు. 10-00); గిరీశం లెక్చర్స్ ఫర్ ట్వంటీఫస్ట్ సెంచరీ (రు. 10-00).... పై మూడు రచనలు ; యమ్వి నారాయణాచార్య .... పద్మా ఎకాడమీ, పెద్దాడ వారి వీధి, టి. నగర్, రాజమండ్రి.

TYAGU - Oru Manithanin Katha by Sivasankari. Translated from Tamil by Uma Narayanan. Published by Affiliated East-West Pvt. Ltd., 25 Dr. Muniappa Road, Kilpauk, Madras 600 010. Price : Rs. 30 00.

# నా చిన్ననాటి ముచ్చట్లు

కె యన్ కేసరి



మద్రాసు క్రిస్టియన్ కాలేజీలో సంస్కృతాధ్యాపకులుగా వున్న వేదం వేంకటరాయశాస్త్రిగారు, ప్రతి సంవత్సరం ఒక కొత్త సంస్కృత నాటకాన్ని విద్యార్థులకు బోధిస్తూ వుండేవారు. 'ఢిల్లీ సుల్తాన్ పట్టుకపోతాన్' అనే పేరిగాని పాత్ర - 'ప్రతాపరుద్రయా' లోది, యించు మించు నూరేళ్లు గడిచినా, యిప్పటికీ తెలుగువారు మర్చిపోలేరు. తన విద్యార్థులకు చక్కటి శిక్షణనిచ్చి, పాత్రోచిత మర్యాద చెడకుండా నాటకాలు వేయించే వారు శాస్త్రిగారు ఉత్తమ నాటక ప్రదర్శన తమ లక్ష్యంగా 'ఆంధ్ర భాషాభిమాని సమాజము' 1889 ఏప్రిల్‌లో పదముగ్గురు సభ్యులతో నెల్లూరులో స్థాపిత మయింది. 1925 నాటి 'రత్నావళి' శాస్త్రిగారి పర్యవేక్షణలోని చివరి నాటక మంటారు .... కేసరిగారి 'చిన్ననాటి ముచ్చట్లు' ఆ నాటి రంగస్థల వైభవానికి, సంగీత, సాహిత్యాదులకు దర్పణం వంటిది. వీటిని నేటి పాఠకుల దృష్టికి తేగలగడం మా అదృష్టంగా భావిస్తున్నాము.

రాజతీవికి ఎన్నికగన్న 'దొరసామి' కి మొదటి రోజులలో యాదా లాపమున తల యోరగిల పెట్టుట అలవాటు. అది రాజవేషమునకు లోటు; దాని నెన్నివిధములనో చెప్పి మాన్పించిరి. కాని ఏ ఏమరుపాటుననో ఎప్పుడో యెక్కప్పుడు రంగస్థలమున నది ప్రదర్శింపబడుచుండెనట. అంత నొకసారి - "బెత్తము తీసికొని ప్రక్క తెరలో నిల్చి యుందును; తల యోరగిల పెట్టితివా రంగస్థలమునకే వచ్చి బెత్తముతో బాదెదను. జాగ్రత్త!" అని శాస్త్రి బెదరించెనట; అట్లే బెత్తము పట్టి నిల్చియుండెనటకూడ. ఆ బెదురుతో అతడా సారికి ఆ పని చేయలేదు; పిదప కూడా ఆ పని చేసియుండలేదు.

ఈ సమాజము నటులలో చాలవరకు శ్రీ శాస్త్రిగారివద్ద చదివినవారు అని పైన చెప్పియుంటిని. అందుచే చిరపరిచితులు. వారి నైజవేషభాషలు శాస్త్రిగారికి బాగుగా నెరుకయే. కావున తమ నాటకములం దాయా పాత్రల చిత్రించునపుడు అందుకైన నటుల నిర్ణయించుకొని వారి నైజముల కొన్నిటి నా పాత్రలకు ఔచిత్యభంగము రాకుండ, హత్తించేవారు. లోపాలోపము లన్నియు తీర్చిదిద్ది తాము స్వయముగా తర్ఫీదు నిచ్చేవారు, అందుచే ఆయా నటులు తాము నటించుపాత్రలతో తాదాత్మ్యము చెందేవారు. బాణాసురుని పాత్ర — శ్రీ యరగుడిపాటి గోపాలకృష్ణయ్యగారికై ఏర్పాటైనది. అయన వరదయ్య పంతులుగారికి రెండవకుమారులు. ఇంట్లో ఎంతో అట్టహాసము చేస్తుండేవారుట. ఆ అట్టహాసము, ఆ అపహాస్యము, ఆ వికటహాసము, ఆ కోపము, ఆ పండ్లుకొరుకుట, మున్నగున వన్నియు ప్రథమ ప్రదర్శమున రంగమందు తన చిన్నకొడుకు - ఇంట చేయునట్లే చేసిచూపగా - మరునాడు శాస్త్రులవారి వద్దకు వరదయ్య పంతులుగారు వచ్చి "మా వానికి తగిన వేష మిచ్చి నావయ్యా!" అని తన సంతోషాశ్చర్యముల తెల్పిరట. గోపాల కృష్ణయ్యగారు రంగస్థలమును త్వరగానే విడిచిపెట్టిరి. వారి అన్నగారు వెంకటచలం పంతులుగారు మాత్రం మరి కొంతకాలము వేషములు వేశేవారు. తమ్ముని తర్వాత అన్నగారీ వేషము వేసి ఒప్పించేవారు. ఆ గోపాలకృష్ణయ్య గారి కుమారులే నేడు సినిమా రంగమున ప్రఖ్యాతి వహించిన వై. వి. రావు గారు (యరగూడిపాటి వరదరావు గారు). నేను స్వయముగా చూచిన కొందరు నటులను గూర్చి ఇక్కడ ప్రస్తావన చేయుదును.

## దొరసామి

ఈయన పేరు కందాడై శ్రీనివాసన్. ఈయన ఆంగ్లమున బి. ఏ. యల్. టి. కొన్నాళ్లు పచ్చయప్ప హైస్కూలు ప్రధానోపాధ్యాయులుగా నుండిరి. పిదప

నెల్లూరిలో వెంకటగిరి రాజాగారి హైస్కూలునం దుపాధ్యాయులుగా నుండిరి. సంస్కృతమున పండితులు. సంగీతశాస్త్ర విశారదులు. భరతశాస్త్రనిధులు. మంచిశారీరము ; సుందరమైన గంభీరవిగ్రహము. రాజఠీవి ఉట్టిపడుతుండేది. రాజవేషమున కాయనను చెప్పి మరి ఇంకొకరిని చెప్పవలయును. దుష్యంతుడుగా తుమ్మెదచే బాధపడుచున్న శకుంతల ఆర్తిని విని - 'ఎవడుర వాడు ?' అని ముందుకు దుముకునప్పుడు, ప్రతాపరుద్రుడుగా - 'మేమురాము' అని తురక సిపాయిలతో నిరాకరించి పలుకునప్పుడు, ఉష శయ్యాగారమున అనిరుద్ధుడుగా బాణాసురినితో నిర్లక్ష్యమున 'నీ అల్లుడను' అని చెప్పి - లాఘవమునలేచి అతనితో కలియబడునప్పుడు - ఆ హొంకము చూడదగినదే గాని వర్ణింప తరముగాదు. "వీరి దుష్యంతపాత్రచూచి జటప్రోలు ప్రభువులు, 'రాజంటే వాడేరాజురా, మిగిలిన రాజులేమిరాజులు తరాజులు' అని వచించి" రట. సంస్కృతపండితుడగుటచే - కఠినపద భూయిష్టమైన శ్రీ శాస్త్రులవారి పద్యములనాయన చక్కగా విడదీసి అర్థభావము లుట్టిపడతగు అభినయ మొనర్చుచు - పరిమితమైన సంగీతముతో చదివినప్పుడు అరటిపండువలిచి చేతిలో పెట్టినట్లుండెడిది. వేషధారణమున ఏయే యుడుపులు ఏపాత్రలకు వలయు ననుటయేగాక, ఏయే రంగములనేయేయవి రాణించునో యనికూడ వారికి శాస్త్రవతుగా తెలియును అని అందురు. వారియందు శాస్త్రిగారికి కడువాత్సల్యము. వారికిని అట్టి భక్తివిశ్వాసములు గురువుగారి యందు. అయిననేమి ? వారి స్వతంత్రప్రకృతి సాటి సభ్యులకు కొందరికి వెక్కసమై ఏదో సాకుపెట్టి నిరసించగా - వారాసమాజము నుండి చాలించుకొనిరి. వారు చాలించుకొనుటతో ఆ సమాజమునకు క్షీణదశ ప్రారంభమైనది. శ్రీ శాస్త్రులవారు వారికై, రంగారావు, అగ్నిమిత్రుడు, పురూరవుడు - పాత్రల నూహించి రచించిన, బొబ్బిలి నాటకము, తెనిగించిన మాళవికాగ్నిమిత్ర, విక్రమోర్వశీయ నాటకములు - వారులేకయే సమాజమువారు ప్రదర్శించిరి. బొబ్బిలి నెట్లో నిర్వహింపగల్గిరి గాని మిగత రెంటికి శాకుంతలమునకు వచ్చినపేరు తేలేక పోయిరి.

దొరసామియు నంతటితో నాటకరంగస్థలము వీడక స్వంతముగా నొక నాటక సంఘమేర్పరచి తాముగా కల్పించిన హరిశ్చంద్రనాటకము, కృష్ణలీలలు, బళ్లారి వారి ప్రహ్లాద, శ్రీజయపురం మహారాజా విక్రమదేవవర్మగారి శ్రీనివాస కళ్యాణము ఇత్యాది నాటకములను కొన్నిటి నాడిరి. అందువరుసగా హరిశ్చంద్ర, యశోధ, హిరణ్యకశ్యప, శ్రీనివాసాదిపాత్రల ధరించేవారు. యశోదపాత్ర ధరించి విక్టోరియా రాణివలె నుండెడివారట. వీరు పిదప కాలమునందు సహాయనిరాకరణోద్యమమున ప్రవేశించి, కారాగారవాసమనుభవించి జబ్బుపడిరి.

శాస్త్రిగారికిని వీరికిని పరస్పరానురాగభక్తితాత్పర్యములు నశించలేదు గావున - జైలునుండివచ్చిన యనంతరము ఉభయులు తిరిగీ కలుసుకొనజొచ్చిరి. అప్పుడు రోగగ్రస్తుడైన తాను చిరకాలము జీవింపజాలననియు, తిరిగీ తమ సమాజమునచేరి, దుష్యంత ప్రతాపరుద్ర పాత్రలను కడసారిధరించి గతింప వలెనని తన అభిలాషయనియు దొరసామి ప్రార్థింపగా శిష్యవత్సలులగు శ్రీ శాస్త్రిగారు వారికా అవకాశ మిచ్చిరి. ఈయన అసలుపేరు శ్రీనివాసన్. అయనను శ్రీ శాస్త్రిగారు అతని యందభిమానమున 'దొరసామి'యని పేరిడిరి. పిదప కొంతకాలమునకు కీర్తిశేషులైరి. అయినను వారిని రంగస్థలమున వివిధపాత్రల నటించగా చూచిన మావంటివారికి ఊహించినంతనే కన్నుల యెదుట కన్పించుచుందురు.

## రంగసామి

ముమ్మడమ్మ వేషము మొదలు, యుగంధరుని వేషమువరకు అన్ని వెషములు వేసినారు. ముఖ్యముగా స్త్రీ పాత్రలను మొదట ధరించుచుండే వారు. శాకుంతల, మల్లమ దేవి, చిత్రరేఖ - మున్నగు వేషములను ధరించే వారు. శకుంతల వేషమున అరణ్యకుల అమాయకత్వము, యౌవనప్రాయపు ముగతనము, భర్తృ తిరస్కృతయై, 'అనార్యా' అని అతని నిందించునప్పటి రోషావేశము - కణ్వశిష్యులు రాజాస్థానమున నీ కర్మమని విడిచి, పోవునప్పుడు దుఃఖాతిశయమున ఏమితోచమి పరవళ్ల త్రొక్కుచు పడు చిడిముడి పాటు - మారీచాశ్రమున భర్తృ పునస్సమాగమమున గాంభీర్యముద్ర - వీనినన్నిటిని - అసదృశముగా నటించేవారు. ఒడ్డుపొడుగుల - దొరసామి రంగసాములు, దంపతుల పాత్రల వహించి రంగస్థలమున కందమిచ్చేవారు. మల్లమ దేవి పాత్ర ధరించినప్పుడు వెలమ యువతులిట్లుందురు కాబోలు అనిపించువారు. శ్రీ శాస్త్రిగారు కాళిదాసు వలెనే ముఖ్య స్త్రీ పాత్రలకు ఒకటి రెండుకంటె ఎక్కువ పద్యములుంచరు. మల్లమ దేవి కట్లె - బాలుని రాణి, బాపన వేస మున బయటకంపు, కరుణోత్తర సంవిధానము - రెండు పద్యములు వ్రాసినారు. ఆ పద్యముల నాయన - ఏ మాత్రమును సంగీతముంచకయే, తగిన (కంఠ) స్వరవిన్యాసమున చదివినప్పుడు ప్రేక్షకులలో కంటతడివెట్టని స్త్రీ పురుషులుండే వారు కాదనిన అతిశయోక్తి కాదు. వీరు పిదప పురుషవేషములను కూడ - ప్రతాపరుద్రుడు, పురూరవుడు మున్నగు వేషములను, ధరించేవారట. వారే నేడు సినిమాలలో ముసలి మగడు గానో, ముఖ్య నాయక ముదుసలి తండ్రిగానో - నటించు రంగసామిగారు.

# యరగుడి పాటి వెంకటచలం పంతులు

నెల్లూరిలో ఆ రోజులలో పేరు చెప్పకుండా ఊరక 'పంతులు' అంటే వీరికే అన్వయం అయ్యేది. నెల్లూరి రంగనాయకుల గాలిగోపురం కట్టించినది వీరి తాత వెంకటలం పంతులుగారు. పంతులుగారు మంచి దర్పంగలవారు. అజాను బాహువులు; ఒడ్డుపొడుగు; స్ఫురద్రూపులు. పాతకాలపు పల్లెటూరి నియోగిపంతుళ్ల అట్టహాసమంతయు వారియందు మూర్తీభవించి యుండేది. ఎవ్వరినైన 'ఒరే' అను చనువు వహించేవారు. బహుశా వారు భక్తి భావమున శాస్త్రిగారిని, స్నేహమున వెంగయ్యపంతులుగారిని మాత్రము మన్ననతో పిల్చే వారు. ఏ సభలో కూర్చున్నా 'సభాపతి' పదవి వహించవలసిందే. అనగా సభాసదులు ఎలాటి శబ్దము చేయకుండ 'సద్దు, సద్దు' అని అదలించుట మొదలు - సభానిర్వాహకులకు కార్యక్రమము నాజ్ఞాపించువరకు - నియంతృత్వము వారిదే. ఆయనకు మంచి సంగీతజ్ఞానము కలదుగాని, పాడుటకు నేర్పుచాలదు. ఆయనకు పద్యములు పాడవలయుననే అభిలాషమెండు. పట్టిపట్టి చదివే వారు. అయితే అభినయమందు దిట్టలు; పైన శాస్త్రిగారి శిక్షణ. శాకుంతల మందు కణ్వశిష్యుడు, ప్రతాపరుద్రీయమున పెకుముకి, ఢిల్లీసుల్తాన్, ఉషలో బాణాసురుడు, నాగనందమున శంఖచూడుని తండ్రి; - ఇత్యాది వేషములు వేసేవారు. బాణాసురుడుగా - ఒక్క శివునితప్ప లోకమంతయు జయించితి నన్న, - అహంకారము, ఇంద్రాదులును తన్నుగొల్చుచున్నారన్న దర్పము, శివునివల్ల వరములుబడసితి నన్న నిర్లక్ష్యభావము ప్రదర్శించు బాణాసురపాత్ర స్వతంత్రభావులైన పంతులుకు ఒప్పియుండేది. వయసు మిగిలిన తర్వాత కూడ ఆయన వేషధారిగా చూపిన లాఘవము అద్భుతము. అనిరుద్ధునితో యుద్ధముచేయుటగా కత్తిసాము చూపెడివారు. బాగుగా దేశీయ కసరత్తు నేర్చినవారు. అయితే వారి సొమ్మైనది, సుల్తాన్ వేషము. ఆ డాబు, ఆ దర్పము, ఆ ఢౌలత్ వారే చూపవలయును; తమకు తెలియకయే, అర్ధరాత్రమున వర్తకుల సరుకుల యోడలో బందీకృతులై - వరంగల్‌కు తరలిపోవుచున్న సీను - అర్ధ రాత్రమునకు తటస్థించును. ఆ సన్నివేశము గంభీరమును విషాద కరమునైనది. ఆతని వజీరులందరు పరస్పర జయకాంక్షులై ఒకరిగొంతు లొకరుకోసుకొనుటకు సంసిద్ధులై యుందురు. అందరు తప్పత్రాగుదురు. వారందరికి కుదురు తాను. కాని ఏమియు నెరంగడు. అప్పుడు వారు ప్రదర్శించు 'భరువసా' వేరెవ్వరు ప్రదర్శింపజాలరనవచ్చును.

## కొండగుంట వెంకటరమణ శాస్త్రి, బి.ఏ.

ఈ పేరు చెప్పితే వీరి నెవ్వరూ కనుక్కో లేరు. యానాదిశాస్త్రి అనే పేరు చెప్పిన "ఓహో! చాకలిపేరయ్య వేషం వేసేవారా" అంటారు. ఈయనకూడా మొదట్లో అమెచ్యూర్సు కంపెనీలోనుండి చిత్రనళీయమున "లోభి" పాత్ర ధరించినవారు. పిదప ఆంధ్రభాషామాని సమాజమునచేరగా శ్రీ శాస్త్రుల వారు ఈ సాటి పుదూరి ద్రావిడ శ్రోత్రియుని - కొలది కాలములోనే చాకలి పేరిగానిని గావించినారు. ఆ కట్టు, ఆ నడక, ఆ అమాయకత్వము, ఆ మాటలో యాస మూడు మూర్తులా చాకలి పేరయ్యయే. ఇంకా ఈయన శాకుంతల ములో జాలరివాని వేషము ధరించేవారు. ఉష, శాకుంతల నాటకములలో విదూషక పాత్ర ధరించేవారు. ఏ వేషము వేసినా దానికి అతికిపోయేవారు. ఈయన పాత్ర నిర్వహణంలో విశేషమేమనగా తనది నీచపాత్ర అని గాని, హాస్యపు పాత్రయని గాని న్యూనతాభావము లేకుండా రంగస్థలమున బహు సౌలభ్యమున స్వేచ్ఛగావ ర్తించేవారు. అందుచే నాటకము బిగితో నడిచేది.

## వేలటూరి తిరువేంగడాచార్యులు గారు

వీరు యుగంధరపాత్ర, ఢిల్లీలో పిచ్చివాడుగ సహా, నటించేవారు ఆ పాత్ర ధారణము వీరికి ఒప్పినట్లు మరియొకరికి ఒప్పెడిది కాదు. పిదప కాలమున రంగసామి కౌశలముతో దీనిని నిర్వహించెనని వింటిని. ఈ పాత్రపోషణమునకు తగిన మూర్తి వీరిది ; సన్నగా, బలిష్ఠమైన పొడవుపాటి దేహము. మంత్రిగా క్లుప్త ముగ, సూచనగా కత్తిరించి మాటలు పలుకునప్పుడు, పిచ్చివాడుగా వెర్రిమొర్రి పాటలతో మాటలతో ఢిల్లీ పౌరుల మధ్య పెట్టునప్పుడు వీరి వాచక పద్ధతి మెచ్చుకొన తగినది. పిచ్చివాని పాత్ర నిర్వహణము చాలా కష్టమైనది. నిజమునకు పిచ్చివాడు కాడు. కాని ఢిల్లీ పౌరులకును పిచ్చివాడుగా నమ్మించునట్లు నటించుచున్నాడు. ఆ స్ఫృహ ప్రేక్షకులకు కలుగవలయును. పరస్పర వైరుధ్యముగల ఈ రెండు హంశములు గమనించి నటించుట కెంతయో నేర్పుకావలయును. ఈ గమనార్థము కవి నాటకము నందందు బహుసున్నితములగు సూత్రముల విడిచి యున్నాడు ; ఆ సూత్రముల పట్టు విడువక నటుడు నటించవలయును. ఇందు తిరు వేంగడాచార్యులుగారు అందె వేసినచేయి. వీరు శాకుంతలమునందు కణ్వమహర్షి వేషము వేసేవారు. తపోవన రంగమున నీ అజాను బాహువు తగుమాత్రపు వేషమున శాంత మొలుకునట్లు, పలుకుట, నడచుట, వ్యవహ రించుట, నిజముగా కణ్వాశ్రమమునే మనము చూచుచున్నామా, అనిపించేది.

శాకుంతలము వ్రాసిన మహాకవి కాళిదాసు, దానియందొక అద్భుత సన్నివేశము కల్పించినాడు. బ్రహ్మచారి, తపస్వి, కులపతి, అరణ్యవాసి అయిన కణ్వునకు ఎవ్వరో కని పారవైచి పసిగందు శిశువును పెంచి పెద్దజేయు భారమును పెట్టినాడు. ఆ శిశవు పురుష శిశువుకాదు; ఆడుబిడ్డ. మగవాడైన 5 సం॥లు రాగనే అక్షరాభ్యాసమొనర్చి, 8 వ ఏట జందెపుపోగువేసి, అధ్య యనమునకు విడుచుచో గారనూనె తలకురాచి జడలు పెంచుకొని - అతడొక శాశ్వతపటువుగా ఆశ్రమము జనాభాలో కలిసిపోయెడి వాడే. శకుంతల అట్లు గాదు. శైశవక్రీడలచే తపోకర్కశని తన్ను కూడా ముగ్ధు నొనర్చుచున్నది. చిన్నారి బాలికయై తన జిలిబిలి పలుకులతో, అర్థరహితమగు చిరునవ్వులతో - వేద జడుడైన తనకు, పుణ్యవంతులగు గృహస్థులకు మాత్రమే లభ్యమగు పెన్నిధుల ప్రదర్శించి వాత్సల్యమున భ్రమింప జేయుచున్నది. గృహకృత్య కార్యకుశలయైన బాలయై తన నిత్యాహ్నికమునకు అవసరమైన సపర్య లొనర్చును. శాశ్వతబ్రహ్మచారికి గృహిణిలేని గార్హస్థ్య సౌకర్యముల మప్పు చున్నది. అజన్మ విరాగియైన తన శుష్కహృదయమును నీ పెంపుడు బిడ్డ అమృతముచే నింపుచున్నది. ఆమె జన్మవృత్తాంతమంతయు తెలిసి, ఇట్లే - ఈమె తన ఆశ్రమమున క్రమముగా గడిపి వాడిపోవలసిన అడవితీగ కాదనియు, రాజాంతఃపుర రాణివాసమున రాణించవలసినదనియు నిర్ణయించుకొన్నాడు. తానుకార్యాస్తరుడై వెళ్లి యున్నప్పుడు అందుకనుగుణముగనే సంగతులు జరిగెనని తెలుసుకొన్నాడు. ఇక నొక్కక్షణమైన నీమె నాశ్రమమున నుంచ రాదని ధర్మశాస్త్రవేత్తగా నిర్ణయించినాడు. కాని ఇంత విరాగికిన్నీ - కొన్ని సంవత్సరములు, ప్రతినిమిష శ్రద్ధతో తాను పోషించిన నీ బాలికను - ఒక్క త్రుటిలో - ఆశ్రమము వెడల నడిపించు నప్పుడు - కలిగిన మనోవేదన చెప్ప తరము గాదు. శాకుంతలను స్థూలముగా నగరమునకంపుటగాదు; ఇన్నాళ్లగా తన వైరాగ్య జీవితమును కూడ వాత్సల్యరస పూరిత మొనర్చిన ఆ బాలిక సూక్ష్మ ప్రకృతినే, స్మృతిపథమునుండి తొలగించుకోవలయును. లేకపోయినచో మామూలు గృహస్థులవలె తానును వ్యవహరింపజాలడు గదా! తన ఆశ్రమ విధులు, ఇక ఎట్టి అంతరాయము లేకుండ సాగిపోవలయును. ఈ సంఘర్షణ మునసే - అ మహర్షి - తన అవస్థనంతయు వర్ణించుకొని - "అరణ్యవాసిని, పెంచిన దోషానికే నేనింత బాధపడుతున్నానే; సంసారలంపటులైన గృహస్థులు - కన్న బిడ్డల విషయంలో ఎంత బాధపడుతారో కదా" అని కరుణరసం ఉట్టిపడ అంటాడు పండితులు - ఈ సందర్భమున కణ్వుని పాత్రకొరకు వ్రాసిన నాల్గుశ్లోకములు - నాలుగు రత్నములు అని చెప్పుదురు. ఈ అచార్ల గారు రంగస్థలమున నిలువెత్తున నిల్చి బహుక్లుప్తమైన సంగీతముతో, చౌక మున, నీ నాలుగు పద్యములను చదువునప్పుడు కాళిదాసన్నట్లు - "కంఠః

స్తంభిత బాష్పవృత్తి" ననుసరించే వారు. బొబ్బిలిలో-పాపారాయని పాత్రయు ఈయన కైయే శాస్త్రులవారుద్దేశించినారట. అయితే ఈ నాటకమాడునాటికి దొరసామి తొలిగినాడు; పూసపాటిరాజు వేషమున కుద్దేశింపబడిన వెంకట చలం పంతులుతోపాటు యీయనయు రంగస్థలమెక్కుట మానినాడు. కను పర్తి సుబ్రహ్మణ్యంగారీ పాపారాయుని వేషము ధరించినారు. అయినను ఆచార్ల వారికి భ్రమవదలలేదు. శాస్త్రులవారిని ప్రార్థించి, పాఠము పఠించి, ముందు వారి ఎదుట ప్రదర్శించి పిదప ఒక్కసారె రంగస్థలమున నటించినారట. ఉభయులను చూచినవారు, కనుపర్తి వారు అభినయాదుల గాంభీర్యము, రౌద్రము చక్కగా ప్రదర్శించినను ఆచార్లవారి సౌకర్యము మాత్రము వారి కల వడలేదు అందురు. వీరి పేరును, చాలమందికి తెలియదు. ఏలననగా, సమాజమున వీరికిని 'బంగారయ్య' అనే మారుపేరేర్పడినది. ఆపేరే అందరికి తెలియును.

## ఇతర నటులు

దొరసామి మేనల్లుడు సుందర రాజంగారు విద్యానాథుడు, బొబ్బిలి రంగ రావు పాత్రలధరించేవారు. విగ్రహపుష్టి, చక్కని కంఠస్వరముగలవారు. అభినయముననూ నేర్పరి. వలీఖాన్ పాత్రధరించిన రామానుజాచారి, రామ దానయ్యంగార్లును ఎన్నదగినవారే, శాస్త్రులవారు వ్రాసిన 'తురక తెలుగు' వీరినోట పుట్టినట్లుండేదిగాని, నేర్చినట్లుండేదికాదు. శ్రీ హనుమంతరావు గారి పిదప ఉషపాత్రను కోవూరి గోపాలకృష్ణయ్యగారు ధరించేవారు. పురు షుడు స్త్రీ వేషము వేసినాడనేమాట అనిపించేదికాదు సరికదా, ఆ వేషము నందు అతని అందచందములు - ఆ 'ఉషా' కన్యకయేనా అనిపించేవి. రంగ సామి చిత్రలేఖ వేషము వేయుటకు ముందు గుంటూరు శివకామయ్యగారు ఆ వేషమును ధరించేవారట. వారును చాలా గొప్పగా నటించేవారందురు. కనుపర్తి సుబ్రమణ్యంగారు, దుష్యంతుని సారధిగాను, ఖుస్రూఖాన్‌గాను నటించేవారు. యుగంధరపాత్రయు, పాపారాయుని పాత్రయు ఒకటి రెండు సారులు వేసినారు. వీరి విగ్రహము రంగస్థలమునకు నిండైనది. కంఠ స్వరము గంభీరమైనది అభినయమును ప్రశస్తమైనది. నాగరాజు, [నాగరాజు అని యొకనటుడు. ఈయన ప్రతాపరుద్రుని పట్టుకొన్న తురకలలోను, బొబ్బిలిలో యుద్ధసమాచారము తెల్పు హర్కారులలోను వచ్చేవారు. ఈయన ఆ తురక తెలుగును సహజముగ నుచ్చరించుచు అభినయించు నప్పుడు ప్రేక్షకు లందరు కడుపు చెక్కలగునట్లు నవ్వేవారు. ఏ నాటకమునందైన చిల్లర పాత్రలును చక్కగా నటించినప్పుడే ఆ నాటకము రాణించును. ప్రతీహారి

వేషము వేయుచుండిన అశ్వర్ధముగారిని కూడ విడువజాలము. ఆయన వెంకట చలంపంతులులవద్ద ప్లీడరు గుమాస్తాగా నుండేవారు. ఆయనయు తన పాత్రను ఎంతో నైపుణ్యముతో నిర్వహించేవారు.

ఈ సమాజమున మరియొక విశేషముకలదు. వీరు హార్మోనియము నుపయోగించువారు కాదు. తంబురను, ఫిడేలును శృతికై వాడెడివారు. మృదంగమునేగాని తపలాను అంగీకరించలేదు. వాద్యగాండ్రు రంగాభ్యం తరమున నుండువారుగాని రంగస్థలమునకు ముందు కూర్చుండేవారు కారు. ఈనాటి ప్రచురప్రచారములుగాని, బిరుదులు, బహూకరణములుగాని, లేని ఆ రోజులలో - అత్యద్భుతముగా నాటకముల నాడి పేరు వడిసినారు. నేడెన్నియో సౌకర్యములున్నను వారితో, సరిపోల్పదగినవారు ఏ అరడజనైన యున్నారా యని నా సందేహము.

## జ్ఞానోదయ సమాజము

వర్ధమానసమాజమున చేరగల, ఉద్యోగఘాయీగాని, ఆంధ్రభాషాభిమాని సమాజమున చేరగల పాండిత్య ప్రకర్షలుగాని, లేకున్నను, నాట్యకళయందు అభిమానము గల కొందరు యువకులు చేరి జ్ఞానోదయసమాజముగా నేర్పడిరి. వీరు సామాన్యులు, యువకులునగుట మొదటి పైయుభయులదృష్టికి నాగలేదు. నెల్లూరున మా మిత్రులలో గొప్పపండితులు, వర్ధమానసమాజమున పెద్దలు నొకరు ఈ సమాజము పేరును - అచ్చతెలుగులోనికి "తెలివి తెల్లవారిన మూక" అని వికటముగ అనువదించిరి.

అయితే ఈ సమాజమున వృద్ధికివచ్చినవారే కీ. శే. శ్రీ నెల్లూరి నాగరాజా రావుగారు; వీరుపిదప రంగస్థలముననేగాక వెండి తెరపై కూడ రాణించిన సంగతి ఎల్లరకు ఎరుకయే. వీరు ఒద్దికల కష్టపడి స్వయముగా అభినయము నేర్చి, కీచకుడు, పాపారాయుడు, పఠాన్‌రుస్తుం మున్నగుపాత్రలను చక్కగా నిర్వహింపసాగిరి. ఆ పిదప వెండి తెరపై, దశరధుడు, ఇంద్రుడు, శకుని, తానీషా మున్నగు పాత్రలను నటించిరి. శ్రావ్యముగ పద్యములు చదువనేర్చిన రాయప్రోలు సుబ్రహ్మణ్యంగారిందు నాయకపాత్రలను ధరించెడి వారు. అయితే వీరికి రాజపాత్రకు ఎలయు ఆకృతిలేదు. నడకలోను చర్యలోను కొన్ని వికృ తము లొనర్చు వారు. కాని వచనముగాని, పద్యముగాని, పాటగాని నిర్దుష్టముగ చదువగలిగినవారు. చక్కగా అభినయించెడివారే. నేలనూతల రామకృష్ణయ్యగారును ఇందునటించుట నారంభించినవారు. కాశీచెంచు గారును ఇందు తయారైన సుప్రసిద్ధనటులు. ఈ సమాజముతో నాకు హెచ్చుపరి

చయము లేదు. కాని అవకాశము కలిగినప్పుడు వారి నాటకము లెప్పుడైనా చూచెడివాడను.

## ఆంధ్ర సభ

నెల్లూరున విద్యా వినోదప్రియులైన యువకులు వకీలు వృత్తి నవలంబించు నాటికి నాటకముల విషయమై వర్ధమాన సమాజము శోభ దరిగినది. ఆంధ్రభాషాభిమాని సమాజమునకును ప్రొద్దు తిరిగినది. అప్పుడు ఆయా సమాజములనుండి కొందరు చీలిరాగా శ్రీ తూములూరి శివరామయ్యగారి యాజమాన్యమున ఈ సభ ఏర్పడినది. ఈ సభయు కొంతకాలము నాటకములాడి మెప్పుగాంచినది. ప్రస్తుత మీ సభ మా మిత్రులు బంధువులునైన శ్రీ చివుకుల మాలెకొండయ్యగారి యాజమాన్యమున నడుచుచున్నది. వీరు విద్యాగోష్ఠుల యందును పాల్గొనుచుందురు. దీని యాజమాన్యమున నెల్లూరి మండల కవుల సమావేశమును, సత్కారమును జరిగియుండెను. ఈ సమాజము యొక్క ప్రథమావస్థయందు వీరి వేవైన ఒకటి రెండు నాటకములు చూచినా నేమో.

నెల్లూరి మిత్రులతో నాకుగల విశేషపరిచయమున, నే స్వయముగ చూచినవే గాక పెద్దలవల్ల విన్నవియు, శ్రీ వంగోలు వెంకటరంగయ్య ప్రభృతుల వ్రాతలవల్ల తెలిసినవియు కూడ, కలిపి వ్రాసితిని. ఇంతవరకు నాటకములగూర్చి వ్రాసిన వారు నెల్లూరు నటులగూర్చి తగినంత వ్రాసి యుండలేదు.

## ఉతారాది నాటక సమాజములు

ఉత్తరాది నాటక సమాజములు కొన్ని చెన్నపట్టణమునకు వచ్చి అప్పుడప్పుడు నాటకములు వేయుచుండువారు. వారట్లు వచ్చినప్పుడు ఈ నగరమునగల ఆంధ్రుల ఆదరణ కోరేవారు. కావున నేను తప్పక వారి దృష్టిలో పడేవాడను. అందుచే వారిలో కొంతమందిని చూచినానని చెప్ప వచ్చును.

వీరికిని నెల్లూరి వారికిని చాల భేదమున్నది. ఏ నల్గురైదుగురు సుప్రసిద్ధనటులలో తప్ప మిగత అందరిది ఒకటే ధోరణి. నెల్లూరి వారు పద్యములు చదువునప్పుడు తగుమాత్రము సంగీతమునే ఉపయోగింతురు. పద్యమును విడమరచి చదువుటచే సులభగ్రాహ్యమై, వారికిని అభినయాను కూలమై, ప్రేక్షకుల కానందదాయకమై యుండెడిది. (ఇంకావుంది

సవిహా

# చిత్రజగతి



## అరీఫా వారి
## 'సామ్రాజ్యం'
## (SAMRAJYAM)

వియస్ ఎంటర్ ప్రయిజెస్ ద్వారా మద్రాసు శాఫైర్ థియేటర్‌లో రిలీజైన ఈ మళయాళ చిత్రంలో 'మమ్మూటి' (న్యూఢిల్లీ, సిబిఐ డైరీ, 1941 మున్నగు చిత్రాలు) అలెగ్జాండర్‌గా ఒక స్మగ్లింగ్ గాంగ్‌కి నాయకుడు. తనకు డబ్బు ముట్టజెప్పిన మనిషికి ప్రత్యుపకారం చేదామనే ఉద్దేశంతో పరిస్థితుల ప్రాబల్యం వల్ల, ఈ అండర్ గ్రవుండ్ వలలో యిరుక్కు, తనకు ఆశ్రయమిచ్చిన వ్యక్తి దారుణంగా హత్య గావింపబడటంలో ప్రత్యర్థుల పై విజృంభిస్తాడు. దైవసన్నిధానాన, మత గురువు ఆశీర్వాదంతో, తను తప్ప వేరే దిక్కులేని యువతిని పెళ్లి చేసుకొన్న అలెక్స్, ఒక బిడ్డ తండ్రి - పొర పొచ్చాలు లేని దాంపత్యం. మద్యం ముట్టడు ; మదిర వెంట పడడు ; సిగరెట్ వూదడు ; కఠిన వాక్కు నెరగడు. ముందు పైలట్ కారు, వెనక సెక్యూరిటీ కారుతో, మధ్యనుంటుంది యితని లిమొజైన్ ... కస్టమ్స్ వారినీ, పోలీసువారినీ తప్పుదారి బట్టించి, కన్ను గప్పడమే గాని, 'స్మగ్లింగ్'లో తప్పేమిటి? - అనే అభిప్రాయం గలవాడు. అయితే, అది త్రికరణ శుద్ధిగా నమ్మలేడు ; తన దర్జాజీవితంలో 'సాంఘిక విద్రోహం' వున్నదని తెలియనివాడు కాదు. తన ముఠా రహస్యం పోలీసులకు తెలియనిచ్చిన శత్రు ముఠా నాయకుని వద్ద (కెప్టెన్ రాజు) వచ్చి, "నేనిక్కడికి రావడం యిది రెండో సారి ; మూడవసారి నన్ను రప్పించవని నమ్ముతున్నాను" అని గంభీరంగా చెప్పి వెళ్లిపోవడంతో, ఈ ప్రధాన పాత్ర ప్రేక్షకులకి పరిచయమవుతుంది .... అలెక్సని చట్టానికి పట్టియిస్తానని చెప్పిన ఐజి బాలకృష్ణన్ కి (మధు), బంధాలేవీ విధి నిర్వహణలో అడ్డురావు తన తల్లి గర్భానజన్మించిన విజయ (సోనియా), తన శత్రువు కుమారని అకృత్యంవల్ల మరణించడంతో అలెక్స్ లోని విలువలు మారిపోయి, రక్త తర్పణాలతో చిత్రం ముగుస్తుంది. దర్శకత్వం : సియమన్ ; సంగీతం : ఇళయరాజా. పిఆర్ఒ : టియమ్‌రామన్.

# చందూర్ రచనలు

నేటి విలువలు
దూరాన్ని జయించిన మానవుడు
ఛార్లెస్ స్టీన్‌మెజ్
కథానికలు
జీవనమార్గం
ఎలినార్ రూజ్‌వెల్ట్
తొలి పాఠాలు
ప్రేమగాథ
హెలెన్ కెల్లర్
డా॥ మేరి వెర్టిస్
నేల - నీరు
మహా నగరంలో
జీవితం
నవచైనా
ప్రతి గురువారం
ఆరు కథలు
చెట్లు
మరొక ఆరు కథలు
ఈ నాగరికత
నాలుగు రోడ్లు
అణుశక్తి
బాలరాజ్యం
గ్రామ వైద్యుడు
సాహస యాత్ర
కాఫీ మానెయ్యటం

పరిచయం చేసిన పుస్తకాలు
అన్యాయం
ఆఖరి కోరిక
ఎక్కడికి కమలా ?
భానుమూర్తి భార్య
రాధ నవ్వింది
కొత్త లోకాలు
కొన్ని గ్రంథాలు
సీతతో సినీమాకు
ప్రజానాయకుడు ప్రకాశం
నట్టింట దీపం
మాంగుమార్ మెయిల్
మహాబలిపురం
మనకీ ఒక కారు
సీతా ఫలాలు
భాష
పూసల మేడ
శివరావు
కలడోలేడో
మావో పాలనలో
చైనాలోమైనారటీలు
అమెరికా
జులై నాలుగు
వరదల్లో వాంగ్
మాతా భూమాతా
చీమలబారు

వీటిలో ఏ ఒక్కటీ ప్రస్తుతం అచ్చులో లేవు. చదవాలను కున్నవారు మీకు లైబ్రరీలో దొరికితే చదవండి



## అగస్టు 01, 1990

నిన్న మధ్యాహ్నం హార్టీకల్చరల్ సొసైటీ గార్డెన్‌లో సినీహీరో రాజ్‌బాబు జన్మదినోత్సవ వేడుక. 'ఈరోజుతో షూటింగ్ అయిపోతుంది. పిక్చర్ మొదటిరోజున మీరు శుభాభినందనలు తెలిపినట్లే, యివ్వాళ కూడా మీరు శుభాకాంక్షలు అందించి, చిత్ర విజయానికి తోడ్పడాలి. శక్తివంచన లేకుండా అందరం కృషి చేశాము ; ఈ చిత్రం నన్ను హీరోగా నిలబెడు తుందని నమ్ముతున్నాను' - అన్నారు రాజ్‌బాబు .... అయిదు పాటలుగల ఈ త్రిభాషా చిత్రంలో (తెలుగులో 'కన్నె పిల్లలు బాబోయ్') ప్రమీల, చాందిని, సిందూరి మున్నగు వారున్నారు. తెలుగుది విజయదశిమికి, తమిళంది దీపావళికి విడుదల చేయాలను కుంటున్నారు.... పిఆర్ఒ : బోస్‌బాబు.

## . . . . . 03

మార్నింగ్ వాక్‌కి వెళ్లి, సల్లివాన్ స్ట్రీట్‌లో నుంచి వస్తూండగా, ఎంతో కాలంగా తెలిసిన రిక్షా మనిషి ఎదురై, 'జేనమ్మగారు పోయి అయిదారు నెలలవుతుంది - మీకు తెలీదాండీ' - అని అడిగాడు మాలతిని. ఇద్దరం నిర్ఘాంతపోయాం. ఏడాదిగా ఆమె కనిపించక పోయేసరికి, ఏవో పనులలో వున్నారో, విదేశ పర్యటనలో వున్నారో, అని అనుకున్నాం గాని, ఈమె అంత తొందరగా తన చెల్లెల్ని కలుసుకునేందుకు వెళ్తుందని అనుకోలేక పోయాము. ఎర్లీ సెవెంటీస్‌లో, మమ్మల్ని నమ్ముకున్న ఆరుగురు ఆడపిల్లల కోసం, వనితా బైండింగ్ వర్క్స్ ప్రారంభించ వలసి వచ్చింది. చిన్న ట్రెడిలూ కేసులూ వున్నప్పటికీ బైండింగ్ ప్రధానం .... ఒకరోజు మధ్యాహ్నం సిస్టర్ పుష్పవచ్చి, 'నాలుగు వందల పుస్తకాలు బైండు చేసిపెట్టాలి - చేస్తారా?' అని అడిగారు. మేము వున్నదే అందుకాయె - 'ఓ, తప్పకుండా' అన్నాను. వైజాగ్‌లో రెండేళ్ల పాటుటీచ్ చేసి వచ్చారామె- తెలుగులో కూడా మాట్లాడగలరు. ఆమె మాటలోని మృదుత్వమూ, ముఖం లోని ప్రశాంతత, కళ్లలోని కాంతిరేఖ. వ్యక్తిత్వంలోని సౌజన్యత మరుపురానివి. బహుశా, ప్రభుసేవలోని తన్మయత్వం ఆమె ముఖానికి ఆ వెలుగు

నిచ్చిందేమో! సిస్టర్ పుష్ప దివ్య లోకాలకు వెళ్లిపోయి, పది పన్నెండేళ్ల వుతుంది. వైజాగ్ నుంచి మద్రాసు వచ్చారు. ఇక్కడో రెండేళ్ల వున్నారు. ఇక్కడ నుంచి పూనా, పూనాలో వుంటూండగానే, ఈ ఊరు వచ్చి నప్పుడు, రెండుసార్లు వచ్చారు మా యింటికి. ఈ ఉదయం జేన్ గురించి విన్నట్లే, పదేళ్లక్రితం పుష్పగురించి పిడుగులాటి వార్త విన్నాము. సిస్టర్‌పుష్ప ద్వారానే మిస్ జేన్ పరిచయమయారు. ఈమె, చెల్లెలంత అమాయకురాలు కాదు ; లోకవృత్తం తెలిసిన వ్యవహార దక్షురాలు. అయితే, మంచితనంలో, మంచి మాటలో, మంచి మనసులో ఒకరికొకరు తీసిపోరు. జేన్‌కి లౌకిక బంధాలు వున్నాయి. దీక్ష పుచ్చు కున్నది కాబట్టి పుష్పకి అలాటి వేమీ లేవు .... నాలుగువందల కాపీల బైండింగ్ తర్వాత, అయిదువేల కాపీలు అచ్చువేసి కాలికో బైండింగ్ చేయ వలసిన పెద్ద వర్కొకటి యిచ్చారు - నాలుగైదు నెలలు పట్టింది. దానితో ఒక విధంగా గట్టెక్కాము. పని చేయ డమూ, బిల్లు యివ్వడమూ కాదిక్కడ - ఆరుగురు ఆడపిల్లలకు ఉపాధి కల్పించే నిమిత్తం ఈ దంపతులు పడు తున్న శ్రమ వృథాకాకూడదు, అనే సద్భావమూ సచ్చింతనతో ఈ సోదరీమణులిద్దరూ మాకు చేయూత నిచ్చారు. ఆర్చిబిషప్ అరులప్ప, బ్రదర్ స్టీఫెన్, సిస్టర్ బ్రిజెట్టి యిలా ఎందరెందరో ఉన్నారు. కాని, సిస్టర్ పుష్ప, మిస్ జేన్ మాకెంతో సన్నిహి తంగా వచ్చారు - ముఖ్యంగా మిస్ జేన్. అరులమ్మాళ్ స్ట్రీట్ నుంచి 'ఐక్యా లయమ్' వైపు మారేదాకా తరుచు తటస్థపడు తూండేవారు. మనకి తెలిసిన వాళ్లూ, కావలసిన వాళ్లూ తెరమరుగు అవుతున్నప్పుడు, తాత్త్విక జ్ఞానం పనిచేయదు ; ఏదో శూన్యత ఆవరిస్తుంది - మంచు మేఘంలా. అయితే, దైనందిన కార్యభారంలో ప్రతి జ్ఞాపకమూ వెనక్కి తగ్గి, పిల్చి నప్పుడు హాజరవుతుంది. మిస్ జేన్ ముఖంపై నిలిచే ఆ నిర్వికారమైన చిరునవ్వు యిక కనిపించదు. May her soul rest in eternal bliss !

. . . . . 05

"నేను కథలు రాయను, కథలు చదవను, కథలు చెప్పను. అయితే రామాయణ కథ మాత్రం నా దృష్టిలో అ జ రా మ ర ం. సూర్యచంద్రాదులు వున్నంతవరకూ రా మా య ణ ం ఉంటుంది. రామాయణంలో నరులూ వానరులేకాదు, పశుపక్ష్యాదులన్నీ వున్నాయి. జటాయువు - 'బర్డ్'; హనుమంతుడు - 'యానిమల్'; మారీచుడు - మాయలేడి ; కాకాసురుడు క్రో ; రామాయణంలో ఈ సమస్త సృష్టీ ఉంది. సర్వకాలాలకు పనికొచ్చే మహాకావ్యమది' - అన్నారు జస్టిస్ కృష్ణస్వామి రెడ్డియార్, ఆదర్స్ గిల్డ్ - మద్రాసు శాఖవారు, భారతీయ విద్యాభవన్‌లో ఏర్పాటు చేసిన 'రా మా య ణ ం - నేటికాలం' (Relevance of Ramayana for

Today) అను సింపోజియమ్‌కి అధ్యక్షత వహిస్తూ. "రామాయణం ఎవరు రాశారు ?"- అనే ప్రశ్నకు, ఉత్తర ప్రదేశ్ విద్యార్థి ఒకతను. సి రాజగోపాలచారి అని చెప్పాడు. రామకథను ఈ నాటి పాఠకులకు సుబోధకంగా వుండే పద్ధతిలో రాజాజీ వ్రాశారు" - అన్నారు చిత్రానారాయణ స్వామి. రాజాజీ మెమోరియల్ ట్రస్ట్ అవార్డ్స్ పొందిన వారు: యమ్‌కె మనుజ, పురుషోత్తమ అనాసక్త్; ఆరెమ్ బర్గొంకర్. ఆ బహుమతులను ఇండియన్ బ్యాంక్ అధ్యక్షులు యమ్ గోపాలకృష్ణన్ అందజేశారు. గిరిధర లాల్ చందక్ వేదిక మీదనున్న వారికి జ్ఞాపికలు సమర్పించారు. పియస్ సుందరం, జయా శ్రీనివాసన్ మున్నగువారు, రామాయణం నేటి కాలానికి ఎలా అన్వయిస్తున్నదీ విపులీకరించి చెప్పారు.

. . . . . 11

"అమెరికాలో నాకు మనుషుల కంటె కార్లు ఎక్కువ కనిపించాయి. గుజరాతీల తర్వాత అధికసంఖ్యలో నున్నది ఆంధ్రులు. అట్లాంటాలో




అందం చిందే సుఖారవిందమునకు ఎల్లప్పుడు వాడండి.
అశోకా
శాండల్ వుడ్ టాల్కం పౌడర్లు
"ASOKA"
ALL PURPOSE
SANDAL WOOD
Powder
"ASOKA"
Sandalwood
TALCUM POWDER
ASOKA
Sandalwood
FACE POWDER
అన్నా
బ్రిలియన్‌టయిన్
నల్లని కురులకు
చల్లదనమునకు
తప్పక వాడండి




జరుగనున్న తెలుగు సభలకు పిల్చారు. 1960 తర్వాత అమెరికా చేరుకున్న ఆంధ్రుల సంక్షిప్త సమాచారం తెలిపే పుస్తకం వెలువరించ మన్నాను - 1991 జులై 20వ తేదీ నాటికి మీ చేతుల్లో ఉంటుందన్నారు. ఇక్కడ నుంచి వెళ్లిన తెలుగువారు ఎంతో సమర్థులుగా, సంపాదన పరులుగా రాణిస్తున్నారు. సంవత్సరానికి 22 లక్షల డాలర్ల రాబడిగల డాక్టర్లు వున్నారు - 40 లక్షల డాలర్లు సంపాదించే వారు కూడా ఉన్నారట ... పిల్లలు తమ తెలుగు సంస్కృతికి దూరమైపోతారేమోనని గుబ్లూ గోపురాలు కట్టిస్తున్నారు.... 'మీరిక్కడ సెటిల్ అవటం మీ పెద్దవాళ్లకి యిష్టమా? అటువంటప్పుడు, పిల్లలపై మీరు మీ అభిప్రాయాలు ఎందుకు రుద్దుతారు? అమెరికనులుగా పుట్టారు మీ పిల్లలు. అమెరికన్ మెయిన్ స్ట్రీమ్‌లో - ఆ జీవన స్రవంతిలో - వారు కలిసిపోగలగాలి - అంతేగాని మీ పూజలూ వ్రతాలూ వారికెలా నచ్చుతాయి?' - అని అడిగాను. నిజమే నన్నారుగాని వారి అంతర్ మధనం వారికి లేకపోలేదు.... నాకీ సారి అమెరికాలో పుట్టిన పండగ (అగస్టు-5), పుట్టినవారం (జులై-30) రెండూ జరిపారు. ఎప్పుడూ లేనిది నాచేత కేక్ కట్ చేయించారు"- అన్నారు డా॥ బెజవాడ గోపాలరెడ్డి, యార్లగడ్డ రాజ్యలక్ష్మి వెంకన్నచౌదరీ కళాపీఠం మేనేజింగ్ ట్రస్టీ శంభుప్రసాద్, గోపాల రెడ్డిగారి 'రవీంద్ర నాటికలు'కి కేంద్ర సాహిత్య అకాడమీ ప్రయిజ్ వచ్చిన సందర్భంగా, ఆయన గౌరవార్థం వుడ్‌లాండ్స్‌లో ఏర్పరిచిన అభినందన సభలో. అమెరికా వెళ్తున్నప్పుడు శుభాకాంక్షలు తెలిపిన మోటూరి సత్యనారాయణ, జగ్గయ్య; ద్రావిడోద్యమ నాయకులు రాజారామ్ ఈ సమావేశంలో ప్రసంగించారు. సభా నిర్వహణ: బియస్సార్ కృష్ణ. కేంద్ర సాహిత్య అకాడమీ వారి అనువాద బహుమతి (ప్రయిజ్)గా పది వేలు; సాహిత్య బహుమతి (అవార్డ్)గా పాతికవేలు ఇస్తారు - బహుమతి ప్రదానోత్సవం మొదటిది అగస్టులోను, రెండవది ఫిబ్రవరిలోను. ట్రాన్స్‌లేషన్ ప్రయిజ్ ఈ సంవత్సరం నుంచే ప్రారంభించారు. మొదటి ప్రయిజ్ గోపాలరెడ్డిగారికి: నలభై అయిదు సంవత్సరాల క్రితం డెటిన్యూగా వెల్లూరు జైలులో వున్నప్పుడు చేసిన అనువాదానికి. 'ఆముక్త మాల్యద' తమిళంలోకి అనువదించిన జగన్నాధ రాజుకి, తమిళ భాషానువాదానికి యిచ్చే ప్రయిజ్ వచ్చింది.

. . . . . 19

జిడ్డు కృష్ణమూర్తి రచనలను తెలుగులోకి అనువదించి ప్రచురించాలనే సంకల్పంతో డా॥ గజాననరావు, గ్రీన్‌వేస్‌లోని 'జెకె' ఫౌండేషన్ కార్యాలయంలో నిన్నా యివాళా, రెండు రోజులూ పొద్దుటా మధ్యాహ్నం సాహితీ సమాలోచన ఒకటి ఏర్పాటు చేశారు - ముఖ్యంగా 'జెకె' వాడిన

ఆంగ్లపదాలకు వేరువైన తెలుగు మాటలు వెతకడంలో ఏకాభిప్రాయానికి వచ్చేందుకు! 'జెకె' రచనలతో బాగా పరిచయం వున్నవారూ, పరిచయం పెట్టుకోదలుచుకున్న వారూ, ఈ సమాలోచనలో పాల్గొన్నారు. మదనపల్లిలో పనిచేసి రిటైరయిన భాషాకోవిదులు హనుమంతరావు, ఈ కార్యక్రమానికి సారధ్యం వహించారు. వెంకటేశ్వరా యూనివర్సిటీ నుంచి వచ్చిన వారూ, స్థానిక సాహితీకారులూ, గూడూరు ఇంజనీరూ మున్నగువారు ఇందులో పాల్గొన్నారు. అనువైన తెలుగుపదాల ఎన్నిక విషయంలో ప్రతి ఒక్కరూ తమకు తోచిన సూచనలిస్తూ, మొత్తం ప్రయత్నాన్ని జయప్రదం గావించారు. రెండు రోజులూ మధ్యాహ్నం సెషన్‌కితప్ప ఉదయం పూట వెళ్లడం కుదరలేదు .... జిడ్డు కృష్ణమూర్తి ఫిలాసఫీ సజీవమూ, సచేతనమూ, సృజనాత్మకమూను. ఆయన చెప్పినవి తెలుసుకోవాలనే తపన చాలామందిలో ఉంది. ఆంగ్ల భాషాజ్ఞానం అంతగా లేనివారికి, ఈ అనువాదాలు నూతన ద్వారాలు తెరుస్తాయనడంలో సందేహం లేదు.




క్రివేణి® ఇంకు
గమ్
ఆఫీసు పేస్ట్
వాడి,
వాటి విశిష్ఠతను
గమనించండి.

kriveni

kriveni
OFFICE PASTE

IS:1221-71
ISI

తయారుచేయువారు:
కృష్ణవేణి ఇంకు ఫ్యాక్టరీ
751, తిరువత్తియూర్ హై రోడ్, మద్రాసు.




. . . . . 22

"నేటి ప్రజాజీవితంపై రాజకీయాల వొత్తిడి ప్రత్యక్షంగాను, పరోక్షంగాను పడుతూనేవుంది. ఆ ప్రభావం సమస్త కళారూపాలలోను ద్యోతకంగాక తప్పదు" - అన్నారు చలసానిప్రసాద్, మద్రాసు ప్రెస్‌క్లబ్‌లోని పాత్రికేయులకు గద్దర్‌ని పరిచయంచేస్తూ. ఆ తర్వాత గద్దర్ అంగ్లంలోమాట్లాడారు. "బ్రిటన్ నుంచి మనకు స్వాతంత్ర్యం 1947లో వచ్చినప్పటికీ ఆస్వాతంత్ర్య ఫలితాలు దేశంలో 80 శాతం అయిన రైతుజనావళికి అందలేదు, అందడం లేదు. విదేశీ పాలకుల స్థానంలో స్వదేశీ ప్రభువులు వచ్చారు - అంతే తేడా! దోచుకోవడమనేది వెనక తెల్లవాళ్లుచేస్తే, యిప్పుడు మనవాళ్లు చేస్తున్నారు. రైతాంగం తిరుగుబాటుతో తప్ప. ఈ పరిస్థితులు చక్కబడవనీ, యగ్రేరియన్ రివల్యూషన్ (రైతు విప్లవం) ఒక్కటే పేదల కన్నీళ్లు తుడవగలదనీ చెప్పడమే నక్సల్‌బరీ ఉద్యమ సారాంశం. వ్యక్తికీ వ్యవస్థకీ మధ్య నేర్పడే సంఘర్షణ నుంచే పాట పుడుతుంది. ఆపాట,అనోటా అనోటాపాకి, చైతన్యధారగా ప్రజాహృదయాన్ని స్పందింప జేస్తుంది.... 1972లో జననాట్యమండలి స్థాపించి, పాటలు కట్టాను, పాటలు పాడాను, పాట ద్వారా ప్రజల మధ్యకి చొచ్చుకుపోయాను. పాట నా ఊపిరి. జానపదులకు చేరువైన బాణీలో పాట ద్వారా నేను చెప్పదలుచుకున్నది చెబుతున్నాను. 'గారడి చేసీ గాంధిటోపితో గద్దెకెక్కిన' వారు కొంద రైతే, మాయ మాటలతో ప్రజను మభ్యపెట్టిన వారు మరి కొందరు. కుడిఎడమల దగా నిరాక్షేపణీయంగా.... 'తమిళనాడు రాడికల్‌యూత్' ఆహ్వానంపై పది రోజుల పాటు తమిళనాడులో పర్యటించడానికి వచ్చాను. కర్ణాటకలో పదిహేనుచోట్ల పాడాను. తమిళనాడు పర్యటనలో సంజు, అంకలేశ్వర్, మురుగేశన్ నాకు తోడుగా వంతపాట పాడతారు. తమిళంలో కూడా ఒకటి రెండు పాటలు పాడుతాను. కళ్ల ముందు జరుగుతున్న అన్యాయాలకు ఆక్రోశించని కవి ఉంటాడా? గుండెలోని ఆవేదన పాటగా ప్రవహిస్తోంది. ఆపాటని గళమెత్తి పాడుకోగల స్వాతంత్ర్యం నాకు లేదా?" అంటూ 'వందనాలు వందనాలమ్మో మా బిడ్డలు' అనేపాట 'చుక్కల్లో కలసిపోయిన మృతవీరుల నుద్దేశిస్తూ పాడారు గద్దర్. రాజకీయ సిద్ధాంతాల మాట అటుంచి, ఆపాటలోని కవితా ఝురికి చలించని వారుండరు.

. . . . . 24

"1985లో అయిదు ఫిలిమ్స్‌లో నటించాను. ఈ నాలుగైదేళ్ల పూర్తిగా డాన్సుకే అంకితమైపోయి. దేశ విదేశాలలో ప్రదర్శనలిచ్చి గుర్తింపు పొందాను. ఇప్పుడు రెండు తెలుగు చిత్రాలలో నటిస్తున్నాను - తమిళంలో కూడా ఆఫర్లు వస్తున్నాయి. కాని నాట్యం తర్వాతనే మిగతావి - నాట్యం,

నా ప్రాణం" - అన్నారు, నాట్య తార సిందూరి 'తాజ్ కోరమాండల్ డూప్లె' లో, తన బర్త్‌డే పార్టీ సందర్భంగా. బ్రిటన్, ఫ్రాన్సు, అమెరికా, సోవియట్ యూనియన్ మున్నగు దేశాలలో నాట్య ప్రదర్శన లిచ్చి, భారతీయ కళా కౌముదిలోని వెలుగులు వెదజల్లిన ఈ ఆర్టిస్ట్‌కి, విద్య, వినయంతో బాటు, నాట్యతార కుండవలసిన శరీర సౌష్ట వమూ, రూప లావణ్యాలు, లాస్యాన్ని పలికించగల నేత్రద్వయమూ, చక్కటి ముఖసోయగమూ వున్నాయి. వందల సంఖ్యలో ప్రదర్శన లిచ్చి ప్రేక్షకు లని మెప్పించిన ఈ నాట్య విద్యా కోవిదురాలు, 'భరతనాట్యం కూచి పూడిలలో మీకు ఏది ఎక్కువ యిష్టం ?' అని ఒకరు అడిగినప్పుడు, 'అదేమిటి, సార్, రెండు కళ్లలో ఏది ఎక్కువ యిష్టమని అడుగుతున్నారు ?' అని చెప్పిందట, ఆ ఒక్క ముక్కా చాలు సిందూరి సామర్థ్యం, సమయ స్ఫూర్తి చెప్పేందుకు .... మెనీ మెనీ హాపీ రటర్న్‌స్, యంగ్ లేడీ !

. . . . . 26

కళాసాగర్ 18వ వార్షికోత్సవం యూనివర్సిటీ సెంటినరీ హాలులో. సీటింగ్ యరేంజిమెంట్ చాలా బావుంది. ఆడిటోరియమ్‌లోకి ప్రవేశించగానే, బాడ్జి ధరించిన కార్యకర్తలు, ఆహూతు లని, వారి వారి కని కేటాయించిన సీట్లవద్దకు తీసుకు వెళ్లి, ఎంతో మర్యాదగా కూచోబెట్టారు. కార్యదర్శి


# మాలతీ చందూర్
## నవలలు

| | |
|---|---|
| వైశాఖి | 16-50 |
| కాంచన మృగం | 16-50 |
| భూమి పుత్రి | 16-00 |
| మధుర స్మృతులు | 14-00 |
| ఓ మనిషి కథ | 16-00 |
| ఏమిటీ జీవితాలు | 12-00 |
| మనసులోని మనసు | 25-00 |
| ఆలోచించు | 9-00 |
| రాగరక్తిమ | 18-00 |
| మేఘాల మేలిముసుగు | 16-00 |
| కలల వెలుగు | 15-00 |
| బ్రతకనేర్చిన జాణ | 14-00 |
| జయలక్ష్మి | 20-00 |
| కృష్ణవేణి | 20-00 |
| ఏది గమ్యం ఏది మార్గం | 15-00 |
| ఎన్ని మెట్లెక్కినా.... | 18-00 |
| సద్యోగం | 15-00 |
| లావణ్య | 14-00 |

### ఇవిగాక

| | |
|---|---|
| వంటలు – పిండివంటలు | 40-00 |
| ప్రశ్నలు – జవాబులు | 15-00 |
| జాబులు – జవాబులు | 13-00 |
| అల్లికలు – కుట్లు | 30-00 |
| అందాలు – అలంకారాలు | 15-00 |
| మహిళలకు మధురజీవనం | 7-50 |
| దాంపత్య జీవితం | 12-50 |

## క్వాలిటీ పబిషర్స్
విజయవాడ - 2

సుభాన్, మిగతా ముఖ్యులూ ఈ విష యంలో అభినందనీయులు బాల్కనీ లోనూ కిందా ఒక్క సీటు ఖాళీలేదు ఇళయరాజా సంగీత విభావరి యిదే మొదటిసారట. టంచన్‌గా ఆరూ అయిదు నిముషాలకి ప్రోగ్రామ్ ప్రారం భమయింది. గంగై అమరన్, బాల సుబ్రహ్మణ్యం, చిత్ర, శైలజ, ఇళయ రాజా మరింకెందరో గాయనీ గాయ కులు శ్రోతలను తెలుగు తమిళ సినీ సంగీత సాగర తరంగాలపై విహరింప జేశారు. 'వన్స్‌మోర్' అని బాల్కనీ అభ్యర్థన! వినమ్ర నమస్కారంతో బాలు క్షమార్పణ. కొన్ని పాటలకైతే, శ్రోతలు కూడా తాళం వేసి, సంగీత రవళిలో తన్మయు లయారు. గంట మ్ముప్పావు ఈ సినీ గానలహరిలో మునకలు వేయడమయాక, బ్రహ్మా నందం, గోపీ చంద్‌ల మిమిక్రీ అనం తరం, కళాసాగర్ అధ్యక్షులు యమ్మెస్ రెడ్డి స్వాగతవచనంతో పురస్కార కార్య క్రమం. ముఖ్య అతిథి: కమల హాసన్; ప్రత్యేక అతిథి: వాస్తుశిల్పి బియన్‌రెడ్డి (యమ్‌పి). 1989, 1990 ఉత్తమ సినీ ప్రముఖులలో (అంటే 88, 89 వి) రామోజీరావు, దాసరి నారాయణరావు, శ్యామ్‌కుమార్ రెడ్డి, రమణమూర్తి, రఘు, యస్పీ బాలసుబ్రహ్మణ్యం, ఇళయరాజా, చిత్ర, మహేష్‌బాబు, నూతన్‌ప్రసాద్, రాజ శేఖర్, బ్రహ్మానందం, రామిరెడ్డి, భానుప్రియ, శ్రీలక్ష్మి, యమున, సుధా రాణి మున్నగు వారున్నారు. కోడి రామకృష్ణ, కెవి మహదేవన్, లతా మంగేష్కర్, చిరంజీవి, సీత, వాణిశ్రీ, మున్నగువారు కారణాంతరాలవల్ల రాలేకపోయారు. కళాసాగర్ అవార్డ్ వేదిక మీద అందుకోవడమే తప్ప యింటికి పంపే ఆనవాయితీ లేదు. గత మూడు సంవత్సరాల నాటక రంగ బహుమతులందు కున్నవారు: కృష్ణ చైతన్య, తాటిబండ్ల ఆనంద రావు, సుబ్బరాయశర్మ, కె విజయ లక్ష్మి, జి హనుమంతరావు. ఉత్తమ నాటకం: పల్నాటి వీరచరిత్ర. ఉత్తమ చిత్రాలు: కళ్ళు (1988); అంకుశం, మౌనపోరాటం (1989) .... పెళ్లి, కాని పెళ్లి, స్టుడియో కాని స్టుడియోలో తీయడం గురించి బియన్ రెడ్డి చెప్పగా, వచ్చే సంవత్సరం నూతన్‌ప్రసాద్ చక్రాలకుర్చీలోగాక, స్వయంగా నడిచి రాగలగాలని ప్రార్థిస్తున్నాను - అన్నారు కమల హాసన్.

— యన్నార్ చందూర్

---

తమ కీర్తి ప్రతాపాలు చెప్పుకొనే వారు, ఏనాటికీ గొప్పవారు గానేరరు.

నమ్మిన సిద్ధాంతాల కోసం ప్రాణం బలి పెట్టడానికి సిద్ధాంగా వుండేవారికి ఓటమి వుండదు.

ప్రజాస్వామ్యం విజయవంతమ యేందుకు, ప్రజాభిప్రాయమూ పౌర భాధ్యత ముఖ్యాంగాలు.

అధిరోహించ వలసిన దుర్గాలూ, దాటవలసిన అడ్డంకులూ, లేనప్పుడు జీవితమెంత నిస్సారం, ఎంత రసవిహీనం!

— పండిట్ నెహ్రూ



పద్మాలయా స్టూడియోస్ (ప్ర) లిమిటెడ్ సమర్పణ
పద్మాలయా క్రియేషన్స్

# బాలచంద్రుడు

స్క్రీన్‌ప్లే-కూర్పు-దర్శకత్వం **కృష్ణ** నిర్మాతలు జి. పద్మావతి, జి. మంజుల

నిర్వహణ జి. హనుమంతరావు, జి. ఆదిశేషగిరిరావు B.Sc.

సీరియల్

# మధు స్వప్న శాఖ

## పూజిత

గడిచిన కథ : డాక్టర్ నాగార్జునకు పెద్దవాళ్లు పెళ్లి సంబంధాలు చూదా మనుకుంటూ వుండగా, చెల్లెలు చందన 'విశాలమీద మనసున్నదని చెప్పేయ కూడదూ ?' అంటుంది అన్నగారితో. విశాల అనుమతి లేకుండా వెల్లడించడం సభ్యత కాదంటాడతను. సివిల్ ఇంజనీరైన విశాలకు యిద్దరు చెల్లెళ్లు - శర్మిల, విమల, ప్రమీలా సూర్యారావు దంపతుల పాలిట వారిద్దరూ ప్రాబ్లెమ్ గరల్స్. శమ్మి, తన బాయ్ ఫ్రెండ్‌తో కలసి కపటనాటకానికి పూనుకుంటుంది. శ్రీనివాసరావు కూతురు లావణ్య. ట్రీట్ చేయాలి డాక్టరు నాగార్జున. ఈ యువకునిపై ఆశలు పెంచుకుంటుంది లావణ్య.... ఇక చదవండి

"మా అమ్మ విషయం నీకు తెలి యదు. కట్నం, ఆస్తి లేకుంటే .... కైమావడలు చేసేస్తుంది మనిద్దరిని. అయినా ఆ ఆస్తిలో నీకూ భాగం వుంది కదా ! ఈ రోజు నీవు వూరికే వచ్చేస్తే.... అదంతా వాళ్ళదే అవుతుంది"

అతను చెప్పినట్టె ప్రవర్తించింది శమ్మి. వాంతి చేసుకుంది. తల్లి కాబో తున్నానని చిన్న అబద్ధం చెప్పింది. ఇక ఈ అవమానం భరించలేక ఆత్మ హత్య చేసుకుంటానని బుడి బుడి ఏడ్పులు ఏడ్చేసింది.

శమ్మి మాటలు నమ్మి ఏడ్చింది ప్రమీల. విశాల కూడ నమ్మింది. "డాడీని ఎలాగైనా ఒప్పిస్తాను. ఇలాంటి పిచ్చి పిచ్చి వేషాలతో జీవి తాన్ని నాశనం చేసుకోకు," అని ఓదార్చింది శమ్మిని.

సమయం చూచి ఒక రోజు శమ్మి విషయం చెప్పింది విశాల - ఆయన వాళ్ళకు పిల్లనివ్వనన్నాడు.

"డాడీ.... ఇది పంతాలకు టైమ్ కాదు శమ్మి భవిష్యత్తు బాగుపడాలనే ప్రయత్నిద్దాం," అంది విశాల ప్రాధేయ పూర్వకంగా.

లక్షల కట్నంతో శమ్మి వివాహం నిశ్చయమైంది.

"మామయ్యా.... ఈ సందర్భంగా మా వివాహం కూడ నిశ్చయం చేయండి," అని అడిగాడు రాజేష్.

"విశాలకు సమ్మతమైతే, చూద్దాం".

"అదేమిటి మామయ్యా.... విశాల ఒప్పుకునేదేమిటి.... మీరు చెపితే తను కాదంటుందా ?"

"విశాల చదువుకున్నది. మంచీ, చెడూ తెలిసినది. తన అభిప్రాయం తెలుసుకోవాలి కద. అదీకాక ఉద్యోగం లో సెటిల్ కావాలనుకుంటోంది."

అకస్మాత్తుగా చందన వచ్చింది. అప్పటి కప్పుడే చెప్పాలనిపించింది, విశాలను తన అన్నగారు వివాహం చేసుకోవాలను కుంటున్నాడని. కాని, అన్నయ్య అనుమతి లేనిదే చెప్పకూడ దని తమాయించుకుంది.

"ఎలా వుంది, అంకుల్"

"పర్వాలేదమ్మా ! రా కూర్చో," అన్నాడు సూర్యారావు.

వచ్చి కూర్చుంది.

"విశాల లేదా, ఆంటీ....?"

"లేదమ్మా వచ్చే టైమయింది".

సాల్ట్ బిస్కెట్స్.... షర్బత్.... తెచ్చి పెట్టింది ప్రమీల.

"ఎందుకు, ఆంటీ, ఇవన్నీ ఇప్పుడు ?"

"తీ సు కో మ్మా !" అన్నాడు సూర్యారావు.

ఇంతలో విశాల వచ్చింది ; విశాల వెంట ఆమె రూమ్‌లోకి వెళ్ళింది చందన.

విశాల, చందన ఏమి మాట్లాడు కుంటున్నారో తెలుసుకోవాలనుకున్న విమ్మి కిటికీ దగ్గరగా వచ్చి నిలుచుంది.

చందన విశాలను బ్రతిమలాడు తోంది. "ఎలాగైనా సరే నీవు ఒప్పు కోవాలి" - అని.

"నో.... చందూ.... డాడీకి ఆరోగ్యం సరిగా లేదు. టైమ్‌కూడ లేదు."

"ప్లీజ్, విశాలా - నేను మాట ఇచ్చాను."

"చందూ, నీవర్థం చేసుకోమ్మా."

"మనిషికి ప్రాబ్లమ్స్ ఎప్పుడూ వస్తూనే వుంటాయి. నీ కళను సద్విని యోగం చేసుకోకుండా అలా దాచి పెట్టుకుంటావేమిటి ?"

వాళ్ళ సంభాషణ విమ్మికి కుతూహలాన్ని కలిగించి లోపలికి వస్తూ.... "నేను రావచ్చా మీ సీక్రెట్స్‌లోకి.... ?" అదోలా అడిగింది.

"ఇందులో సీక్రెట్స్ ఏమున్నాయి - నీవు పార్టు తీసుకోవాలనుకుంటే తీసు కోవచ్చు."

"దేనిలో ?"

"వుమెన్స్ క్లబ్‌లో కొన్ని ప్రోగ్రామ్స్ జరుగుతున్నాయి."

"ఓ.కె తప్పకుండా పార్ట్ తీసు కుంటాను" సంతోషంగా అంది విమ్మి.

చందన నవ్వి...." చూసావా విశాలా విమ్మి నీలా డాన్సర్ కాకున్న ప్పటికీ ఎంత ఉత్సాహంగా పార్ట్ తీసుకుంటానంటోందో ! ఇంత మంచి డాన్సర్‌వి.... కాలేజీలో ఎన్నో ప్రయిజు లందుకున్నావు మరి అపుడే సంసార బాధ్యతలన్నీ నెత్తిన పెట్టుకున్న నాయనమ్మలాగ, 'ఇప్పుడు కాదు ?' అని నీలోని కళను దాచేస్తున్నావ్ .... నీవు డాన్స్ వేయవలసిందే, మేము చూడవలసిందే ఇక తిరుగులేదు. రేపు ఇదే టైములో వచ్చి తీసుకెళతాను.... రెడీగా వుండు" అనేసి జవాబు కొరకు ఎదురు చూడకుండా వెళ్ళిపోయింది చందన.

మూడు రోజులు రిహార్సల్స్ జరిగి ఆ రోజు ప్రోగ్రామ్ మొదలయింది. మొదట చందన, విశాల పాటపాడారు. ఆపాట, ప్రోగ్రామ్‌కే హైలేట్. ఆ తరువాత చిన్న, చిన్న కవితలు.

ఆ తరువాత మరపించే మురిపించే నాట్యం. ఇంజనీరైన యువతిలో యింతటి కళా హృదయమా, ఇంతటి నాట్యకౌశలమా ?

అంతా వీడియోలో కెక్కింది.

పూర్తయి ఇవతలకి వస్తూనే విశాలను కౌగిలించుకుంది చందన.

'ఒన్సమోర్,' అని చప్పట్లు మారుమోగాయి. స్టేజి మీదకు.... చందన వచ్చి చెప్పింది. "ఇప్పుడు మళ్ళీ అదే నాట్యం చేసేందుకు వీలుకాదు. చాలా ప్రోగ్రామ్స్ వున్నాయి. మరొకసారి ఎప్పుడైన చేస్తుంది కుమారి విశాల. కొద్దిసేపట్లో ఒక నాటిక ప్రారంభమౌతుంది. ఎవరూ బుజాలు తడముకోకండి."

పాట అందుకున్నారు.

"ఆడవారమండి.... మేము అందాల రాణులం" అంటూ,

నాటక సారాంశం ఒక దంపతులకు ఒక అబ్బాయి. ఒక అమ్మాయి. ఇంకో




జెమిని పళ్ళపొడి
జెమిని కెమికల్ ప్రోడక్ట్స్ (ఫర్మ్) పోస్ట్ బాక్స్ నం. 7,
మచిలీపట్నం-521 001. ఆం ప్ర. (ఇండియా)
పళ్ళకు తెలుపుదనం — చిగుళ్ళకు గట్టిదనం.

దంపతులకు ఒక అబ్బాయి. ఒక అమ్మాయి. రోజులు మారాయికదండీ; అబ్బాయే అత్తవారింటికి వెళ్ళాలి. అమ్మాయి పుట్టింటిలోనే వుండాలి; కొడుకు కోడలితో వెళ్ళిపోవటం.... కూతురితో అల్లుడు వచ్చి వుండటం. అబ్బాయి అమ్మాయి ఇంటికి వచ్చాడు కాబట్టి కట్నం పోరు అత్తాకోడళ్ళ తగూలాట లేక నిశ్చింతగా వుంటారని ఆ దంపతులు ప్లాన్‌చేసి వాళ్ళ, వాళ్ళ కొడుకులకు కూతుళ్ళకు పెళ్ళిచేస్తారు. హాస్య సన్నివేశాలతో కడుపుబ్బ నవ్వించే డైలాగ్సుతో నాటిక ముగిసింది.

ఈ రచన చేసినది కూమారి చందన - అని, అందులో పాల్గొన్న వాళ్ళ పేర్లు చెప్పింది క్లబ్ సెక్రటరి.

విశాల చక్కటి డాన్స్ చేసినందుకు, చందన హాస్యనాటిక రాసినందుకు, ఫ్రెండ్స్ వాళ్ళ చుట్టూ చేరిపోయారు. స్త్రీలు పల్చబడ్డాక నాగార్జున వచ్చి విశాలకు కంగ్రాట్స్ చెప్పాడు.

అదే సమయాన రాజేష్ అక్కడ ప్రత్యక్షమయాడు. అతన్ని చూచి అయిష్టంగా ముఖం తిప్పేసుకుంది చందన.

ఆమెను నఖశిఖ పర్యంతం చూస్తూ నాగార్జున దగ్గరగా వచ్చి.... "మీరేనా డాక్టర్ నాగార్జున?" అనడిగాడు.

అవునన్నట్లు తల పంకించాడు నాగార్జున.

"నాపేరు రాజేష్.... విశాలకు కాబోయే హజ్‌బెండ్ని.... మా.... మేనమామ కూతురే విశాల.... త్వరలోనే మా వివాహం జరుగుతుంది" అనేసి వెళ్ళిపోయాడు.

లిప్తపాటు అనూహ్యమైన నిశ్శబ్దం చుట్టు ముట్టింది.

"ఇడియట్...." అని సన్నగా తిట్టింది చందన.

## 20

నిండైన ప్రేమ పాత్రలో,.... విషబీజంలాంటి విలన్ కూడ వున్నాడన్నమాట.... వెలరేగే ఆలోచనలన్ని కట్టిపెట్టి, వీడియో అన్ చేసాడు. విశాల డాన్స్ మొదలయింది. ఆమె డాన్స్ చూస్తూ అన్నీ మరచి అందులో లీనమై పోయాడు.

నాగార్జున రూమ్‌లోకివచ్చి వీడియో ఆఫ్ చేసింది చందన. ఆమె రాకను అతను గమనించలేదు. "చందూ" అన్నాడు.

"నేను నా రూమ్‌నుండి గమనిస్తూనే వున్నాను. ఇప్పటికి నాలుగుసార్లు అదే డాన్స్‌ను అన్‌చేశావు. ప్రస్తుతానికిచాలు. ఇప్పుడు టైమెంత అయిందో తెలుసా? పన్నెండు దాటింది."

"సరేలే. నీవు వెళ్ళు నేను ఆఫ్‌చేసి పడుకుంటానులే" మళ్ళీ వీడియో అన్‌చేస్తూ చెప్పాడు.

"కావాలంటే రేపు చూడవచ్చు. ఇవ్వాళ ఇక వొద్దు అన్నయ్యా, ఇక నీతో మాట్లాడను. చిన్నప్పటి నుండి నీతో పెరిగిన ఈ చెల్లెలికన్నా నిన్న మొన్న వచ్చిన ఆ స్వీటి అంత ఎక్కువైందా నీకు....? ఆ స్వీటీని మెచ్చుకున్నావ్ గాని నేను రాసిన నాటికను



"Dad, some say that the Seeta abducted by Ravana was not the real one but only a fictitious one. What has happened to the real one?" asked Raghu.

"Rama Katha with its innumerable charms is a many-splendoured beauty of human greatness and frailty. According to one version, Rama being an incarnation of god, was quite aware of his mission and purpose. He had to put an end to the evil deeds of Ravana by eliminating him. Rama knew that Ravana would come to Panchavati to kidnap Seeta. So, he requested her to create a duplicate of herself, as Ravana would turn into ashes the moment he touches Real Seeta. A mere lifting her eyebrow was enough to turn that mighty Ravana into a speck of dust," explained Raghu's Father.

"You mean Real Seeta on her own created a Fake Seeta to make a hero out of Rama - like the dupe we see in the movies?"

"Your comparison is crude. At the behest of her lord, she entered *Yoga Agni* (sacrificial fire) and recreated herself as a Fake Seeta - just a replica. That is why after the death of Ravana, this Fake Seeta entered Agni, to comeout unscathed - the Real One. The more you delve in, the brighter the pearls you get."

---

*Swadharma Swaarajya Sangha* *(Director : BVSS Mani*
*Beehive Bldgs - 29, Prakasam Road, Madras - 600 103.*



యింతమంది.... మెచ్చుకున్నా.... కనీసం నీవు ఒక్క మాటైనా అనలేదు."

"సారీ చందూ.... ఆ రాజేష్ వచ్చి మూడ్ చెడగొట్టాడు. నీవు రాసిన నాటిక, నీవు నటించిన పాత్ర.... నీవు పాడిన పాట.... బ్రహ్మాండంగా.... అమిత బ్రహ్మాండంగా...."

"ఏడ్చి విందు చేయించుకున్న ట్లుంది. నేను అడిగాక చెప్పడం....?"

"సారీ చెప్పాను గదమ్మా! ఈ బ్రదర్‌ని నీవుగాక ఎవరు ఆదుకో గలరు?"

"ఆ స్వీటితో నీతరపున మంతనాలు జరిపేందుకు....?" అంటూ భంగున తన రూమ్‌లోకి వెళ్ళిపోయింది చందన.

## 21

నాలుగు గంటల ప్రాంతంలో డాక్టరు నాగార్జున పనంతా ముగించు కుని, ఇంటికి రాబోతున్న సమయంలో శ్రీనివాసరావు వచ్చాడు.

"గుడ్ ఈవినింగ్ డాక్టర్. నా పేరు శ్రీనివాసరావు. మా అమ్మాయి లావణ్య. బ్రిలియంట్ చైల్డ్. ఎం.ఎ చేసింది. ఆమెకు వివాహం నిశ్చయమై పెళ్ళి పీటలమీద స్పృహతప్పి పడి పోయింది. అప్పటినుండి ఆమె బిహే వియర్‌లో మార్పువచ్చింది. ఎక్కడికో వెళ్ళిపోవాలంటుంది. 'ఫ్రీగా వదలి పెట్టండి' అని గొడవ చేస్తుంది. సరిగా ఆహారం తీసుకోదు. ఏమిటో ఆలోచిస్తూ కూర్చుంటుంది. మందులు వద్దంటుంది. ఎవరిని దగ్గరకు రానీయదు. చిరాకు పుడితే చేతికందిన వాటిని విసిరి కొడుతుంది. మానసిక వైద్యంలో మీరు స్పెషలైజ్ చేశారని, మీపేరు విని, మీదగ్గరకు వచ్చాను. తిని తిరుగుతూ.... ఏవిధమైన యబ్నార్మా లిటీ లేకుండా హాయిగా వున్న అమ్మాయికి ఈ వ్యాధి ఎలా వచ్చిందో బోధపడకుండా వుంది."

"పేషంట్‌ని తీసుకొచ్చారా...?"

"లేదండీ.... మీరే స్వయంగా ఇంటి కొచ్చి చూస్తే.... మంచిదని అనుకుంటున్నాను."

"సారీ, ఈ రోజు రాలేను. రేపు ఉదయం తప్పక వచ్చి చూస్తాను పద కొండు దాటాక వస్తాను."

శ్రీనివాసరావు వెళ్ళిపోయాడు.

## 22

"హు.... నీకూతురు బి.ఇ ఫస్ట్‌క్లాసు లో పాసయిందనీ.... డాన్సర్‌గా ప్రయిజులు పొందిందనీ మురిసిపోతు న్నావ్, మమ్మీ.... ఎవరికి.... కావాలట అవన్నీ....?"

"అదేమిటి విమ్మీ; అలా అం టావు? .... మనిద్దరిలో ఎవరి కొచ్చినా ఒకటే. ఈ ప్రయిజు నీవే తీసు కుని నీ కబ్బోర్డులో వుంచుకోమ్మా," అంది విశాల.

"ఆ వుమెన్స్ క్లబ్‌లో నన్ను ఎవరూ గుర్తించలేదు కాని, ఈబోడి ప్రయిజు ఎవరికి కావాలట?" అని చేత్తో విసు రుగా తోసేసింది.

విశాల చేతిలోవున్న నటరాజ విగ్రహం క్రిందపడి విరిగిపోయింది.

# RAJA - LAKSHMI AWARD

Ms. LATA MANGESHKAR, the melody queen of India, has been chosen for the RAJA - LAKSHMI AWARD 1990. The Award consisting of Rs. 50,000/- and a Citation will be presented to her on November 19, 1990, at a function at Madras. In her capacity as recipient of this Award, Ms. LATA Mangeshkar will be invited to the United States, by the Telugu Fine Arts Society, New Jersey, U.S.A., to receive 'Dr. K. V. Rao and Dr. Jyothi Rao Award'. RAJA LAKSHMI AWARD is an annual award instituted by SRI RAJA - LAKSHMI FOUNDATION, Madras, in 1979 to promote literature, arts, sciences, humanities and other intellectual pursuits.

## రామవరపు కృష్ణమూర్తిశాస్త్రి

రాజా - లక్ష్మి సాహిత్య పురస్కారాన్ని ఈ సంవత్సరం, సుప్రసిద్ధ సంస్కృత పండితులు భాషా ప్రవీణ, తర్క, వ్యాకరణ, పూర్వోత్తర మీమాంస విశారద, శిరోమణి రామవరపు కృష్ణ మూర్తి శాస్త్రిగారికి పదివేల రూపాయలు, (రు 10,000/-) ప్రశంసా పత్రం నవంబరు 19న మద్రాసులో బహూకరిస్తారు.

ఈ పురస్కారంతో పాటు శ్రీకృష్ణమూర్తి శాస్త్రిగారికి అమెరికా వాస్తవ్యులు Dr. M.D.N. రావుగారు, వారి తల్లిదండ్రులు మిత్తింటి ఆదినారాయణ శ్రీమతి మిత్తింటి అన్నపూర్ణమ్మ పేరిట స్థాపించిన "MAN - MAP AWARD" క్రింద మరో పదివేల రూపాయలు (రు 10,000/-) కూడా బహూకరించ బడుతుంది.

**SRI RAJA LAKSHMI FOUNDATION,**
**Madras-600 018.**

హృదయం ముక్కలైనట్లు బాధపడింది విశాల.

ప్రమీలకు పట్టరాని కోపం వచ్చింది.

అసూయ చల్లారినట్లు తృప్తిగా శ్వాస ఎగపీల్చి, తన రూమ్‌లోకి వెళ్ళిపోయింది విమ్మి.

శమ్మి ఇవన్నీ పట్టించుకునే స్థితిలో లేదు. ఆమె ప్రేమవలలో చిక్కుకుని వుంది. రాజేష్‌కి కొంతలో కొంత సంతోషంగా ఉంది.

ఏదో వస్తువు క్రిందపడిన శబ్దానికి సూర్యారావు అక్కడకు వచ్చి, ఏమిటనీ అడిగాడు. ఇదంతా తెలిసి, ఎక్కడ ఆవేశం కలిగి గుండెనొప్పి వస్తుందోనని, పగిలిన విగ్రహం పక్కగా దాచేస్తూ.... "మీరెందుకు లేచివచ్చారు, డాడీ?" అంది విశాల.

ప్రమీలను, విశాలను చూస్తూ, "ఏమి జరిగింది" అనడిగాడు. వాళ్ళు మౌనంగా వున్నప్పటికీ రాజేష్ అంతా చెప్పేశాడు.

"ప్లీజ్, డాడీ.... మీరు కోప్పడ వద్దు..... వూరుకోండి" అయన్ని తీసి కెళ్ళి సోఫాలో కూర్చోబెట్టింది. ప్రమీల వెళ్ళి గ్లాసుతో చల్లటినీళ్ళు తీసుకొచ్చింది. అవి ఆయన చేత తాగించి, తండ్రి పక్కనే కూర్చుని, .... "డాడీ ఇలాంటివన్నీ మీరు పట్టించుకోవద్దు. ప్రశాంతంగా వుండండి," అని ప్రేమగా చెప్పింది విశాల.

ప్రమీల కూడా ఆయన దగ్గరగా కూర్చుని, బేలగా ఆయనవైపే చూస్తోంది. గుండెను కుడిచేత్తో రాసుకుంటూ, .... విశాల తలమీద చేయి వేసి.... 'విశాలా' అన్నాడు ఆప్యాయతగా.

"డాడీ.... విమ్మి చిన్నపిల్ల.... రేపటికి తనే కలసిపోతుంది. మీరు వర్రీ కావద్దు." ఆమె స్వరంలో అనురాగాన్ని గ్రహించిన సూర్యారావు వదనం ప్రసన్నంగా మారింది.

## 23

రాజేష్‌తో విచ్చలవిడిగా తిరగ వద్దని విమ్మీని ... మందలించింది ప్రమీల. "ఎందుకయ్యా.... ఇంగితం లేకుండా చిన్న పిల్లలని నీవెంట బెట్టుక తిప్పుతావు?" ఉద్విగ్నంగా అడిగాడు సూర్యారావు.

"మీరు భ్రాంతిలోపడి ఇలా నిందిస్తున్నారు. విమ్మి పరాయిది కాదుగా.... ఎప్పుడయినా బోరుగా వుంటే అలా వెళ్తాం.... దానికే పెడర్థాలు సృష్టించి, .... విచిత్రమైన ఇతిహాసాన్ని కలిగిస్తున్నారే. నన్ను అవమానపరుస్తున్నారే ...." అని అప్పటికప్పుడే ప్రయాణానికి .... సిద్ధమయ్యాడు రాజేష్.

"మామయ్య ఏమన్నారని.... అంత ఉక్రోషంగా వెళుతున్నావ్?" అనడిగింది ప్రమీల.

"వెళ్ళనీయ్ మమ్మీ.... వెళ్ళేవాళ్ళని ఆపడం దేనికి?" అంది విశాల.

"నేను నిన్నువదిలి వెళ్ళిపోతున్నానని అనుకోకు.... నిన్ను మాత్రం విడువను. మీ నాన్న చెప్పాడులే, నీవు ఉద్యోగంలో.... సెటిలయ్యాక మన పెళ్ళి ఏర్పాటు చేస్తానని....,"

అలా అంటున్న రాజేష్‌ను చావి చెంప దెబ్బ కొట్టాలనుకుని, .... తండ్రిని చూసి నిగ్రహించుకుంది విశాల.

"అంటీ.... మీ కూతుర్ని ఒప్పించి త్వరగా ముహూర్తాలు పెట్టే ఏర్పాటు చేయండి," అనేసి వెళ్ళి పోయాడు బ్యాగ్ బుజాన తగిలించుకు.

"విమ్మి వెంట తిరుగుతూ.... నాతో పెళ్ళంటాడేమిటి.... ఇడియట్" అని తిట్టుకుంది విశాల. అయినా ఇంటి లో నుండి వెళ్ళిపోయినందుకు తృప్తిగా గాలి పీల్చుకుంది.

ఆ కిరాతకుడు ఏ బీభత్సవాన్ని సృష్టిస్తాడోనని ప్రమీల వణికి పోయింది. సూర్యారావు నిర్లిప్తంగా వుండిపోయాడు.

## 24

ఆ రోజు తెల్లవారే పూజ ముగించుకుని,.... తల్లి ఇచ్చిన ప్రసాదాన్ని నోట్లో వేసుకుని.... పూజగదిలోంచి వస్తూవుంటే ఫోన్ రింగ్ అయింది.

"హలో" అంది ఫోనందుకుని.

"శుభోదయం శుభోదయం" అని రెండుసార్లు వత్తి చెప్పాడు.... క్షణం ఆమె కనుబొమలు ముడిపడి.... అంత లోనే అర్థం అయినట్లు, విడిపోయాయి.

"మీరేమి చెప్పాలనుకున్నారు ?"

"అదేనండి.... గుడ్ మార్నింగ్, గుడ్ మార్నింగ్"

ఒక్కపలుకుచాలు పరిమళాలుచిలుకు
త్రివేణి
25P.
TRIVENI
SWEET SUPARI
తీపి వక్కపొడి
కోట్లాదిప్రజలు
మక్కువతో కోరుకొనేది
త్రివేణి నట్‌పౌడర్ మాన్యుఫాక్చరింగ్ కో

ఆమె నవ్వింది.... ఆ నవ్వులో చిరుగంటలు వినిపించాయి నాగార్జునకి.

"మీ స్వరంలోని తీపిదనం.... ఇలలోని ఇతిహాసం"

"ఇంతకీ.... శుభోదయాన మీరు చెప్పదలచుకున్న విశేషం.... తెలుసుకోవచ్చా".... వ్యంగ్యంగా అడిగింది.

"మీరు నా భాషను హేళన చేస్తున్నట్టున్నారు"

"అబ్బే, అదేమి లేదండి.... తెలిసి పోతూనే వుంది."

"ఏమని ?"

"మీ చెల్లెలు చందనగారి తెలుగు కవిత్వం చదివి వచ్చారని"

నాగార్జున నవ్వి "అదేమి లేదండి, మీరు చేసిన డాన్స్ వీడియోలో పదహారు సార్లు చూశాను" అన్నాడు.

"అందుకనే మీరు సైకియాట్రిస్ట్ అయారు."

"ఎందుకనిట ?"

"పదహారు కప్పుల అయిస్‌క్రీమ్ తిన్నట్టు, పదహారుసార్లు డాన్స్ చూడ టమేమిటండీ ?

ఆమె నవ్వు శబ్దతరంగ లాస్యంలా చెవులకి సోకింది.

"ఇంతకీ మీ కెందుకు ఫోను చేసానో తెలుసా ?" అని అడిగాడు.

"భారతం వి ని పిం చేం దు కు కాదనుకుంటా"

"కాదు కాని, అంతా మీ చందన తప్పేనండి. తనేమో.... ముసుగుతన్ని పడుకుని నన్ను రింగు చేయమంది"

"ఆమెకింకా వుషోదయం కాలేదు. పాపం, నిద్ర పోనీయండి.... ఆమె లేచేసరికి నేను ఆఫీసులో వుంటాను."

"బెస్ట్ ఆఫ్ లక్"

"థాంక్యూ"

నాగార్జుని పేషెంట్స్‌ని చూస్తూండగా శ్రీనివాసరావు వచ్చాడు.

అయన్ని చూచి చిన్నగా నవ్వి.... 'మీ కెందుకు శ్రమ ? నేను వస్తానని చెప్పానుగా' అన్నాడు నాగార్జున.

అయిదు నిముషాల్లో బయలు దేరాడు నాగార్జున.

శ్రీనివాసరావు బంగళా ముందు కారు ఆగింది.

కార్పెట్లూ, సోఫాలు, విలువైన ఫర్నిచరూ ఆఇల్లుగలవారి ఐశ్వర్యాన్ని చాటి చెబుతున్నాయి.

ఇద్దరూ మేడమీదకి వెళ్ళారు.

గది ముందు నిలుచుని 'లావణ్యా' .... అని పిలిచాడు శ్రీనివాసరావు. తలుపు మూసి వుంది.

లోపల నుండి సన్నని సంగీతం.

నౌకరు పరుగెత్తుకుంటూ వచ్చి. "బాబుగారండి, బా బు గా ర ం డి. అమ్మాయిగారు.... అమ్మాయిగారు...."

"ఏమయింది అమ్మాయిగారికి ?"

"ఏమి కాలేదండి.... మీరెళ్ళాక అమ్మాయిగారు బయట వెళ్ళిపోబో తుంటే...."

"ఏమయింది ...?"

కుతూహలంతో వింటున్నాడు నాగార్జున.

"పోనీయకుండా తాళం వేసా మండి," అని చెప్పాడు నౌకరు.

తాళం అందుకుని తలుపు తెరిచాడు శ్రీనివాసరావు.

తలుపు తెరచుకున్న వెంటనే, రెడీగా వుంచుకున్న వస్తువులన్నీ, ఒక్కసారిగా వాళ్ళపైన విసిరింది. ఆ వస్తువుల ధాటికి శ్రీనివాసరావు.... నౌకరు అలవాటు ప్రకారం గుమ్మం దాటి బయటకి వచ్చేశారు.

డాక్టరు నాగార్జున మాత్రం అలాగే నిలబడి వున్నాడు.

చేతి కందినవన్ని విసురుతూనే వుందామె.... చివరిగా దిండు విసిరింది. అయినా అతను కదల్లేదు. ఆ విసిరిన దిండుని క్యాచ్.... పట్టుకున్నాడు.

ఆవచ్చిన వ్యక్తి, తను విసిరే వస్తువుల ధాటికి కదలక అలా నిలిచే సరికి.... చిర్రెత్తుకొచ్చింది లావణ్యకు. ఏమీ కనిపించకపోయేసరికి, అటు, ఇటు వెతికి డ్రస్సింగ్ టేబిల్ మీద వున్న జడ కుచ్చులు గుప్పిట పట్టి విసిరి కొట్టింది.

జడకుచ్చులు కాచ్ చేశాడు నాగార్జున.

ఎవరీ మహాపురుషుడు, విగ్రహంలా నిలుచున్నాడు ? ఇంకా ఏదైనా గట్టి వస్తువు కనిపిస్తుందేమోనని.... లావణ్య తలెత్తింది.

నిలువుటద్దానికి అభిముఖంగా వున్న ఆమెకు నేరుగా నాగార్జున ప్రతిబింబం అద్దం నిండుగా కనిపించింది. అతని ప్రతిబింబాన్ని చూసి అచేతనంగా నిలబడిపోయింది.

లిప్తపాటు కంపించిపోయింది.

మంత్ర విహంగ మైన మనసు భ్రాంతి భావాలతో తలక్రిందులై పోయింది. కుడిచేతి చూపుడు వ్రేలు, క్రింద పెదవిపై సుతారంగా కదిలిస్తూ



అపూర్వ సృష్టినేదో చూస్తున్నట్టు అలాగే నిలుచుంది పెదవులపై లాల సతో మందహాసాన్ని కురిపిస్తున్నాడు. అదే.... ఆనవ్వే.... ఆ కను దోయి, ఆ విశాల ఫాలబాగం, చిరుగాలికి అల్లరి చేసే అదే అందమైన క్రాపు.

మధురమైన సంగీతం మదిలో మెదిలినట్లు, నిరీక్షణలో దొరికిన నవ రత్నం ఆమె కనుల మెరిసినట్లు, ప్రేమ పల్లవి సంగీత నాదమై కమనీయంగా పలికినట్లు.... మధురస్మృతులు మంజులగానమై మదిని ప్రోచినట్లు.... సాగరసంగమంలోని ఓ కెరటం కదలి వచ్చి, సృష్టికే శృంగారమై.... నెల వంకగామారి, చిరువెన్నెల చిమ్మినట్లు .... ఆ చిరువెన్నెల్లో చిరు దీపికై కదలి వచ్చే కలహంసలా - అతనికి చేరువైంది ఆమె. ఆ విశాల నేత్రాలలో అతని రూపం ఇమిడి పోయింది. ఆనందపుటంచులు.... అధిగమించి నట్లు అతన్ని చూస్తున్న లావణ్యా.... "క్రిష్ణా.... క్రి....ష్ణా.... నీ కోసమే ఎదురు చూస్తున్నా" అంటూ నాగార్జున పాదాలకు అల్లుకుపోయింది. ఇనుప హస్తాలతో బంధించినట్లు గట్టిగా పట్టు కుంది. స్పృహ తప్పి అతని పాదాల మీద వాలింది.

శ్రీనివాసరావు కళ్ళల్లో అశ్రువులు.

"ఈ డాక్టరు బాబు కాళ్ళకు చుట్టుకుపోయిందేమిటి ?" అని నౌకరు తలగోక్కున్నాడు.

లావణ్యాను బెడ్ మీదకు చేర్చారు.

## 26

"నిన్ను ఎమ్.ఎ చదివించింది. ఉద్యోగం చేయమని కాదు.... అంత ఖర్మ మనకేమి పట్టింది ?" శాంతమ్మ గట్టిగా కేకలేస్తూంది చందన మీద.

రెండు చేతులతో తల పట్టుకుని, "ప్లీజ్, గ్రాండ్‌మా.... అలా.... మాట్లాడకు. కర్మ పట్టిన వాళ్ళేనా .... ఉద్యోగాలు చేసేవాళ్ళు ?" అంది చందన.

"అవును.... హాయిగా.... ఇల్లు .... పిల్లలు, వీటిని చూచుకోక .... తగుదునమ్మా ! అని వూరి మీద పడతావెందుకు.... ?"

"గ్రాండ్‌మా ఇవి మీ రోజులు కావు.... పురుషుడైనా.... స్త్రీయైనా .... కష్టపడి పని చేయాలి. సమాన హక్కులున్నాయి. ఆఫీసుల్లో సమా నంగా పని చేయటం లేదూ ?"

"పోవే పిచ్చుకా ! సమాన హక్కు లనే మాట నేర్చారు మీ కుర్రకారు" - నవ్వేసింది శాంతమ్మ.

చందనకు ఏడుపు ముంచు కొచ్చింది - తను జాబ్ చేసేందుకు తల్లీ, గ్రాండ్‌మా ఒప్పుకోవటం లేదని.

"అన్నయ్యా ... నీవైనా చెప్ప కూడదూ అలా వింటూ కూర్చోక పోతే"

"ఏమని ?" పేపరు చదువుతూ కూర్చున్న నాగార్జున అడిగాడు.

"స్త్రీలు ఈ రోజుల్లో ఉద్యోగాలు చేస్తున్నారు. చందు చేసినా .... తప్పు లేదని...."

"ఆ విషయం గ్రాండ్‌మాకి తెలుసనుకుంటాను."

ఉక్రోషంగా చూసింది చందన.

"చందూ చదువుకొన్న ప్రతి స్త్రీ ఉద్యోగం చేయాలని తాపత్రయ పడితే .... ఇక పురుషులగతేమి కావాలట ?"

"నీవు కూడా నన్ను జాబ్ చేయటం మానుకోమంటావా అన్నయ్యా"

"అదికాదు. నేచెప్పింది అర్థం చేసుకో .... స్త్రీకి అవసరమైతేనే చేయాలంటాను" అన్నాడు నవ్వుతూ.

"అన్ని వసతులున్నవారు కూడా ఉద్యోగం కోసం పాకులాడితే ఏళ్ళ తరబడి నిరోద్యోగం అనుభవిస్తూ దరిద్రంతో అల్లాడిపోయే ప్రజల మాటేమిటి, అంటాను. ఈ మధ్య ఇలాంటి కేసులు.... చాలా వస్తున్నాయి. ఒకతను ఎం.ఎ చదివాడు. ఫస్ట్‌క్లాసులో పాసయ్యాడు. ఇ ఇద్దరు చెల్లెళ్ళు. కుటుంబ పోషణ భారమంతా మీదవుంది- ఎందుకంటే తండ్రి అకాల మరణం వలన వాళ్ళు చిన్న పిల్లలుగా వున్నప్పుడు తల్లే కష్టపడి చదివించిందట. ఇప్పుడు తల్లి అనారోగ్యంతో వుంది. తల్లిని చూచుకోవాలి. ఇద్దరు చెల్లెళ్ళకు ళ్ళిళ్ళు చేయాలి. నిరుద్యోగం.... ఇంతలో రాజశేఖరం వచ్చాడు - ఒక కొత్తవ్యక్తిని తీసుకుని.

"ఇతను నా బాల్యస్నేహితుడు శివసుందరం - ఇతని కొడుకు న్యూయార్క్‌లో ఇంజనీరింగ్ చదివి వచ్చాడట."

నాగార్జునని, చందనని పరిచయం చేశాడు రాజశేఖరం, శివసుందరానికి.

చందన వైపు చూచి, "చక్కని అమ్మాయి.... మావాడికి జోడి...." అని మనసులో అనుకుని, "రాజా, నీవు చాలా అదృష్టవంతుడవి," అన్నాడు శివసుందరం.

రుచిలో నెం.1
క్రేన్ వక్కపొడి
CRANE
దక్షిణ భారతదేశపు నెం.1 వక్కపొడి
CRANE

"ఎందుకట ?"

"చక్కటి కూతురు, చక్కటి కొడుకు ...."

నవ్వేశాడు రాజశేఖరం.

"నీకులేరా ఏమిటి.... ?"

"వున్నారు. నలుగురు కూతుళ్లకు పెళ్ళిళ్ళ చేశాను. మిగిలింది కొడుకు, వాడికి బాగా చదువు చెప్పించాను. చిల్లిగవ్వ మిగల్చ లేక పోయినా, నా కొడుకు చాలా ఆదర్శవంతుడు. 'నీకు చిల్లిగవ్వ మిగిల్చలేదు. చదువు ఒక్కటె నీకు ఆస్తి. నీ స్వయంకృషితో నీవు పైకి రావాలని' అన్నాను. కట్నం పుచ్చుకోవటం మా అబ్బాయి దృష్టిలో క్షమించరాని అపరాధం...."

"అంతలోతైన మనసుగల వారెం దరు ఈ రోజులలో...." అన్నాడు రాజశేఖరం నవ్వుతూ !

"మీ అబ్బాయి, మీరు చాలా ఆదర్శపరులు.... ప్రతి ఒక్కరిలో ఇలాంటి భావన కలిగితే.... ఈ దురా చారం అణగారి పోతుంది" అని, చిన్న పిల్లలాగ తన అభిప్రాయం చెప్పింది చందన.

ఆశ్చర్యంగా చూశాడు శివసుందరం.

"అలాగా" సాలాలోచనగా పలి కాడు.

" .. చందూ కోరిక మీద నేను చాలా ట్రయ్ చేశాను. కాని.... అలాంటివాళ్ళ దొరికేది బహుకష్టం. కట్నంలేదు అనేసరికి పిల్లుల్లా చప్పున పారిపోతారు. మంచి సమయంలో నీవు వచ్చావు. ఎలాగైనా ఈరోజు నుండి నాకొక భారం తగ్గిపోయింది. కట్నం లేని పెళ్ళికొడుకుని వెతికే శ్రమ."

"అయితే ఇంకేమి ?.... అబ్బాయికి అమ్మాయి, అమ్మాయికి అబ్బాయి నచ్చితే.... శీఘ్రమేవ కళ్యాణ ప్రాప్తి రస్తు" చేయెత్తి దీవిస్తూ అన్నాడు శివసుందరం.

## సినిమా పేరు ?

**భారతదేశం సక్కని పాడియావురా**
**అడిగినన్ని పాలిచ్చే అమ్మతల్లిరా**

గేయరచన : కొసరాజు ; పాడినవారు : యల్లార్ ఈశ్వరి

ఆ పాట ఏ చిత్రంలోనిది ? సరిగా చెప్పగలిగిన మొదటి యిరువురికీ పదేసి రూపాయలు బహుమతి. ఎక్కువ మంది చెప్పగలిగినప్పుడు, చీట్లువేసి, మొదటి యిరువురికే బహుమతి ఇవ్వడం జరుగుతుంది.

మీ జవాబు కార్డుమీదనే వ్రాయండి : చివరి తేది : 10-11-1990



JAGATI, 2, Kutchery Road, PB 2922, Mylapore, Madras-600 004.

# సినిమా పేరు?

'నీ వుంటే వేరే కనులెందుకూ నీ కంటే వేరే బ్రతుకెందుకూ' అనే పాట 'స్నేహం' (సాగర చిత్ర) లోనిదని పోటీలో పాల్గొన్న వారిలో 90 శాతం చెప్పగలిగారు.... బహుమతి పొందిన వారు : పి వి యస్ యన్ పద్మకుమారి, కేరాఫ్ : పి పద్మనాభం, ఎల్ డబ్ల్యుఒ ఆఫీసు, కలిచేడు - 524 409. నెల్లూరు జిల్లా .... ఖైరి సీతారామ మూర్తి, వడ్డాది - 531 026. విశాఖ జిల్లా.... విజేతలలో మొదటి పదహారు గురు : 1 డి నవీన్‌కుమార్, కంచిక చర్ల 2 జి ప్రసాద్, తిమ్మసముద్రం 3 వి కృష్ణవేణమ్మ, కందుకూరు 4 సి లలిత, నెల్లూరు 5 ఇ కనక దుర్గ, రాజ మండ్రి 6 డి ఆశీర్వాదం, పెనుగంచి ప్రోలు 7 పి శర్మ, హైదరాబాదు 8 సి విజయకుమార్, సికింద్రాబాదు 9 కె అనుపమ, నెల్లూరు 10 పి పద్మ నాభన్, రావిచేడు 11 యన్ శ్రీనివాస మూర్తి, నెల్లూరు 12 ఎ రామారావు, హైదరాబాదు 13 పి చలపతి, చిత్తూరు 14 వి ప్రేమ్‌కుమార్, సికింద్రాబాదు 15 ఎ ఉపేంద్రరావు, హైదరాబాదు 16 కె సమాధానం, అనిగళ్లపాడు.... పోటీలో పాల్గొన్న అందరికీ అభినందనలు.

# 'జగతి' చందాకూపను

2, కచేరిరోడు - పి.బి 2922
మైలాపూరు - మద్రాసు-600 004

ఈ నెలనుంచి 24 సంచికలు పంపగోరుతూ రు. 45/-కు (నలభై అయిదు) బాంకు డ్రాఫ్ట్ లేదా పోస్టల్ ఆర్డరు లేదా మనియార్డరు రసీదు ఇందులో జత పరిచినాను.

పేరు ....................................................

అడ్రసు ....................................................

....................................................

....................................................

తేదీ : సంతకం

Jagati - 2, Kutchery Road, P.B 2922, Mylapore, Madras-600 004

నును సిగ్గుతో లోపలి కెళ్ళి పోయింది చందన.

రాజేశ్వరి కాఫీ ఫలహారాలతో వచ్చింది.

నాగార్జున, శివసుందరం ఇచ్చిన ఫోటో తీసుకుని చందన దగ్గరకు వెళ్ళాడు 'చెల్లాయి పెళ్ళికూతురాయెనే' అని పాడుతూ ఆమెకు ఫోటో చూపించాడు.

ఓరగా చూసింది. ఆదర్శంతోపాటు అందమైనవాడు.

కట్నం తీసుకోని వరుడ్ని వివాహం చేసుకోనని.... భీష్మించుకు కూచున్న చందు, వివాహం అనగానే, ఆడవాళ్ళ సహజ లక్షణమా.... అన్నట్లు మెలి కలు పోయి సిగ్గులు కుమ్మరించింది.

"విశాలనుకూడ కనుక్కొని డాడీతో చెప్పి.... రెండు మ్యారేజస్ ఒకేసారి ఏర్పాటు చేయించు"....అంది సన్నగా సోదరునితో.

"ఆ పనేదో నీవే చేయమ్మా !"

"నేనా....?"

"అఁ...." అన్నాడు తల పంకిస్తూ.

"విశాలతో నీవే మాట్లాడితే బాగుంటుందనుకుంటాను."

నాగార్జున నవ్వి.... "నీ స్నేహితు రాలితత్వం.... నీవింకా.... గ్రహించ లేదా! పెళ్ళి తరువాత ప్రేమ అంటారు. అలాంటి వ్యక్తిత్వమే నీస్నేహితురాలిది .... నేనడిగితే నోరైనా విప్పుతుందో లేదో.... నీకూ ఆమెకు మంచి స్నేహ మేగా కనుక్కో, ఆమె సరే అంటే పెద్దలు మాట్లాడుతారు.

"నీకు మనస్ఫూర్తిగా ఇష్ట మేగా.... ?"

"నీవు అది అడగాల్సిన ప్రశ్నా ?" అన్నాడు నవ్వుతూ.

"సరే రేపే వెళ్ళి కనుక్కుంటాను."

## 27

"లేస్తూనే ఏమని అడిగిందో గుర్తుందా.... ?"

"మిమ్మల్ని"

"నన్నా.... ఏమని.... ?"

"అతను ఎవరూ ? ఎక్కడున్నాడూ .... ?" అని. డాక్టరు నాగార్జున అని చెప్పాము.... లండన్ నుంచి నాలుగు రోజుల క్రితమే వచ్చారని కూడా చెప్పాము. ఆయన పేరదేనా.....? డాడీ, వెంటనే ఆయన్ని కలుసుకోవాలి, ఆయన్ని పిలిపించండి, నేను.... ఆయన దగ్గర ట్రీట్‌మెంట్ తీసుకుంటాను.... ఆయన నన్ను బాగు చేయగలరు రియల్లీ డాడీ !.... అని చెప్పింది."

"మీరు వర్రీ కావద్దు.... మార్పు కనిపిస్తోంది"

"మీరు ఈ రోజు వస్తారా, డాక్టర్ ?"

క్షణం ఆలోచించి చెప్పాడు. "మీరు మరోలా భావించవద్దు. ఇప్పుడు నన్ను చూస్తే ఆమెకు మళ్ళీ స్పృహ తప్పిపోవచ్చు"

"ఎందుకని ?"

(ఇంకా వుంది



